# సద్ధమ్మ స్వరాలు (బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)


గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం

సమతా సైనిక్ దళ్ సారథ్యంలో

ప్రచురణ కాలం : 2015

ప్రతిపాదిత చందా : ₹ 25/-

కాపీలకు : 94410 89829

వివరాలకు : gouravmeka@gmail.com


# విజ్ఞప్తి

వ్యక్తులకు విశిష్ట ప్రాముఖ్యతనిస్తూ అందర్నీ కూడగట్టి ఒక్క దరికి చేర్చాలనే భావనకంటే, మరుగున పడ్డ భావాలకు ప్రాధాన్యత నిచ్చి యువతలో సామాజిక స్పృహను పెంపొందించే సంకల్పమే స్ఫూర్తిదాయకమనే భావన నాది. కాబట్టి ఈ పుస్తకంలో చేర్చాల్సిన అభ్యర్థులు ఇంకా కొంతమంది ఉన్నంతలో వారి కృషి పట్ల గౌరవ భావమున్నప్పటికీ నాకున్న పరిమితుల రీత్యా ప్రస్తుతం ఇంతమందిని మాత్రమే ఎంచుకోవడం జరిగిందేగాని, దానర్థం ఇతరుల్ని మరుగున పరచాలనే దురుద్దేశం మాత్రం కాదని తెలియజేసుకుంటూ ఇంతకంటే సునిశిత ప్రతిభాపాటవాలతో కూడిన ప్రజాతంత్ర ప్రయత్నాలు భవిష్యత్తులో మరిన్ని జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

- గౌరవ్



# అంకితం

అణగారిన ప్రజల వెలుగుజ్యోతి,
అద్వితీయ ప్రజా తత్వవేత్త
డా॥ **బాబాసాహెబ్ బీమారావు రాంజీ అంబేద్కర్**
అపూర్వ కృషికి.....

# కృతజ్ఞతలు

యార్లగడ్డ జగదీశ్వరరావుగారు (మైత్రేయి బుద్ధ ఆశ్రమం, వేమగిరి); రాచకొండ నరసింహాశర్మగారు (విశాఖపట్నం), రాజు గోగులం గారు (హైదరాబాద్), కోడూరి సత్యనారాయణ గారు (ఏలూరు); ఉపాసక. ఎన్. జగన్నాధంగారు (విశాఖపట్నం)

* * *

"సమస్య తన పరిష్కారానికి తానే అడ్డంకి అయినట్టు చౌరవలోనూ చైతన్యంలోనూ అసమతుల్యం ఉండడానికి కులం ఒక కారణం అయినపుడు, దాని ఫలితంగా ప్రజా ఉద్యమాల అగ్రశ్రేణులలో కులంరీత్యా ఆధిక్య స్థానంలో ఉన్నవాళ్లే ఎక్కువ ఉండడం అనేది జరిగితే, అది కుల సమస్య పరిష్కారానికీ ఆ పైన ప్రజా ఉద్యమ పురోగమనానికీ అవరోధం కాదా అనే ప్రశ్న సైతం వస్తుంది. దళితుల సమస్యలు దళితులే పరిష్కరించుకుంటారనీ, స్త్రీ సమస్యలు స్త్రీలే పరిష్కరించుకుంటారనీ, గిరిజనుల సమస్యలు గిరిజనులే పరిష్కరించుకుంటారనీ, ముస్లిం సమస్యలు ముస్లింలే పరిష్కరించుకుంటారనీ భావించడం ఎవరి సమస్యలూ పరిష్కారం కాకుండా ఉండడానికే ఉపయోగపడుతుంది.... ఉద్యమాల నాయకత్వం అట్టడుగు కులాల నుండీ, స్త్రీల నుండీ, మైనారిటీల నుండి సమపాళ్ళలో సహజంగానే పుట్టుకు రాకపోవడం ఒక లోపాన్ని సూచిస్తుందన్న వాదనను కొట్టి పారేయడానికి వీలులేదు."

\- కె. బాలగోపాల్

# ఇందులో....

# ప్రస్తావన

కొన్ని సంవత్సరాలక్రితం వొహ పేద్ద బుద్దిస్టును ఇంటర్వ్యూ కోసం కలిస్తే ఆయన నాకు ఫలానా స్వామీజీ, ఫలాలా బాబాజీ చెప్పేది కూడా బౌద్దమేనని చెబుతూ ఇంటిముందింత పిరమిడ్ వేలాడదీసుకుని తన మేధస్సును ప్రదర్శించుకో ప్రయత్నించారు. ఆ దెబ్బతో ఇంటర్వ్యూల కార్యక్రమాన్నే మొత్తంగా విరమించుకుని బౌద్ధాన్ని ఆ స్థాయికి దిగజార్చడం ఇష్టంలేక ఆయనకో దండం పెట్టి వెనుదిరిగొచ్చేసాను. ఐతే అలాంటివార్ని దృష్టిలో పెట్టుకుని ప్రపంచ చరిత్రలోనే అరుదైన అపూర్వ ప్రజాస్వామ్య వ్యవస్థను నిర్మాణాత్మకంగా రూపొందించే ప్రయత్నం చేసిన అద్వితీయ దార్శనిక మానవీయ మార్గానికి సంబంధించిన చర్చను వర్తమాన వ్యవస్థలో కొందరి ఇష్టాయిష్టాలకు లోబడి విస్తృతంగా చేపట్టకుండా అవాంఛనీయ పరిమితుల్ని నాకు నేను విధించుకోవడం న్యాయమనిపించలేదు. అందుకనే ఉభయ తెలుగు రాష్ట్రాల్లో నున్న కొంతమంది బౌద్ధ ఉద్యమకారుల్నీ, కార్యకర్తల్నీ, మేధావుల్నీ, రచయితల్నీ ఎంచుకుని ఇంటర్వ్యూ చేసి ఈ సంకలనాన్ని వెలువరిస్తున్నాను. నాకు సన్నిహితులైన బౌద్ధమిత్రులు సైతం ఇంటర్వ్యూ అడిగితే ఔననీ వొప్పక, కాదనీ చెప్పక వాళ్ళ స్థాయికి నాబోటి వాడ్ని కల్సి మాట్లాడ్డం చిన్నతనంగానే భావించారు, కనీసం నేనలా భావించేలా ప్రవర్తించారు. మానవ సంబంధాల విలువా, స్నేహానుబంధాల చలవా తెల్సినవాణ్ణి కాన దీనిపై నేనింకేమీ వ్యాఖ్యానించదల్చుకోలేదు గానీ అంతిమంగా ఈ అభియోగాల్ని మోయాల్సింది వారి అంతరాత్మలే కాబట్టి నేనీ విషయంలో ముద్దాయిని కాదల్చుకోలేదు. ఇకపోతే, మొత్తం తెలుగు రాష్ట్రాల్లో ఎంతోమంది బౌద్ధాభిమానులున్నారు. అంబేద్కర్ వెలుగులో బౌద్ధాన్ని అర్థం చేసుకున్నవారితో మొదలెట్టి స్వీయ సాధనతో అధ్యయనం చేసి బౌద్ధాభిమానులుగా గడుపుతున్నవారి వరకూ అనేకమంది బౌద్ధులు కనిపిస్తారు. నా వ్యక్తిగత వ్యయప్రయాసల్నీ, సాంఘిక పరిమితుల్నీ అంచనా వేస్తూ ఈ క్రమంలో ప్రస్తుతం యింతమందిని మాత్రమే కల్సి ఇంటర్వ్యూ చేయగలిగాను. ఇంకా ఎంతోమంది ప్రముఖులు ఉన్నప్పటికీ ఈ పుస్తక పరిధిరీత్యా వార్ని మినహాయించుకోవడం జరిగిందేకాని వారి కృషిని మరుగుపర్చే ఉద్దేశం నాకెంతమాత్రం లేదని సవినయంగా మరోసారి తెలియజేసుకుంటున్నాను. ఇక ఈ ఇంటర్వ్యూ విషయానికి వస్తే, అన్నీ కూడా పనిగట్టుకుని నేనే స్వయంగా వెళ్ళి చేయడం జరిగింది. భావోద్యమాలు ఏ రకమైన సమస్యలు అంటే, అగ్రకులాధిపత్యం, పురుషాహంకారం, విమర్శల్ని సహించలేని

గుణం, వ్యక్తిగత - కౌటంబిక వ్యవహారాల్లో ప్రజాస్వామిక పంథా లేకపోవడం, ప్రత్యామ్నాయ ఉద్యమాల పట్ల సహానుభూతి లేకపోవడం మొదలైన వాటితో సతమతమౌతూ స్త్రీలనూ, పిల్లలనూ, యువతనూ దూరం చేసుకున్నాయో సరిగ్గా ఇవే అవలక్షణాలు బౌద్ధోద్యమాన్ని కూడా బాధిస్తున్నాయనేది నా అనుభవ అభిప్రాయం. భావోద్యమాలకెలా సభలూ, పుస్తకాలు, విగ్రహాలే ప్రధానమయ్యాయో బౌద్ధోద్యమాల్లో సమావేశాలు, ప్రచురణలు, విహారాలూ ప్రాధాన్యతనలా సంతరించుకున్నాయి. నిజ జీవితంలోని పరాయీకరణను ఎదుర్కోలేని వ్యక్తులంతా నిత్య జీవితంలో బౌద్ధ అభిమానులుగా, నాయకులుగా చలామణీ అవటం చూస్తే జాలేస్తుంది. భావాల మార్పుకు ఆడంబర అక్షరాలు, ఆధ్యాత్మిక శిబిరాలు మాత్రమే కాక మానసిక పరిపక్వతా, దార్శనిక పరిశీలనా కూడా తోడ్పడతాయనే స్పృహ లేకపోబట్టే ఈరోజు భావోద్యమాల్లాగానే బౌద్ధ సంఘాలు కూడా క్షేత్రస్థాయి మనుషుల మనసుల్లో ఆత్మిక సౌహార్ద్రతతో ప్రేమపూర్వకంగా వెలుగొందాల్సిన సామరస్యసమన్వయ సమతా నిలయాలుగా కాక, కొద్దిమంది చదూకున్న పెద్ద మనుషులకూ, కాలక్షేపం మేధావులకూ మాత్రమే అందుబాటులోనుండే ప్రత్యేక హెూదా గల వ్యాపకమైనాయి. అలాగే వ్యక్తిగతంగా భావోద్యమకారులైనప్పటికీ బౌద్ధోద్యమానికే మాత్రం తీసిపోని ఇద్దరు ఆచరణవాదుల ఇంటర్వ్యూల్ని అనుబంధంగా చేర్చాను. ఇక ఇంతకంటే ఈ ప్రమాణాల్ని విశ్లేషించడం అతికాబడుతుంది కాబట్టి వ్యక్తిగత జీవితాల్లో ప్రవర్తన మార్చుకోకుండా ఇతరుల్ని చులకనగా చూసేవారికెన్ని లక్షలసార్లు విపశ్యనా ధ్యానం చేస్తే తెలిసొస్తుందో ఒక అంచనా వుంటేమంచిదన్న విషయాన్ని సగౌరవంగా చెపుతూ, సమకాలీన సమాజంలోని సమస్యలకు ఒక హేతుబద్ధ పరిష్కారాన్ని సూచించే మార్గంలో భాగంగా, సర్వమానవాళి కళ్యాణాన్నీ, సుఖ సంతోషాల్నీ కాంక్షించే మహాప్రవాహమైన బౌద్ధంలో ఈ ప్రయత్నమొక నీటిబొట్టని తెలియజేస్తూ, అజరామరమయిన ప్రజా సంక్షేమవాదం బౌద్ధం వ్యాప్తికై జరుగుతున్న అనంతమయిన యత్నాలకు అత్యంతల్పాతి అల్పమయిన నా యీ స్వల్ప కృషి ఎంతమాత్రంగా తోడ్పడ్డా నాకంతకుమించిన సత్యాన్వేషణా సంతృప్తి ఇంకేదీ లేదని ఈ సందర్భంగా ప్రకటిస్తూ, ఇంతటితో ఈ ప్రస్తావన చాలిస్తున్నాను. **చిరం తిట్టతు సద్ధమ్మో!**

- గౌరవ్



సీనియర్ బౌద్ధోద్యమకారులు

# చింతకాయల పావనమూర్తిగారితో ఇంటర్వ్యూ

ప్ర) మీ బౌద్ధోద్యమ ప్రస్థానం గురించి చెప్పండి?

జ) మాది యానాం. కాకినాడ, వైజాగ్‌ల్లో చదివా. అంబేద్కరిజానికి సంబంధించిన 'జైభీమ్' ఆంగ్లపత్రిక మద్రాసు నుంచి వెలువడేది. అది బాగా చదూతుండేవాడ్ని. అలా రైల్వే మెయిల్ సర్వీసులో చేరి పగలుద్యోగం చేస్తూ రాత్రిళ్ళు చదూకునేవాడ్ని. అలా అంబేద్కర్ సాహిత్యం ద్వారా బౌద్ధుడ్నయ్యా.

ప్ర) మీ కార్యక్రమాల గురించి చెప్తారా?

జ) ఆంధ్రా బుద్ధిస్ట్ సొసైటీ నేనే నడిపేవాడ్ని. దానికి ప్రెసిడెంటుగా ఉన్నా. షెడ్యూల్డ్ క్యాస్ట్ ఎంప్లాయిస్ యూనియన్‌ని నేనే చూసేవాడ్ని. ఉక్కునగరంలో బౌద్ధం వెలుగొందేలా చేయాలనే ఏకైక ఆశయంతో ఎంతో కష్టపడి ఎన్నో బుద్ధ విహారాలకి సహకరించాను. నా ఆప్తమిత్రుడు ఎండ్లూరి చిన్నయ్య రచించిన అంబేద్కర్ జీవిత చరిత్రను తెలుగులో మొట్టమొదట చొరవచేసి ప్రచురించింది నేనే. అలాగే ఎంతోమంది బౌద్ధులుగా మారడానికి తోడ్పడ్డాను. అంబేద్కర్ కుమారుడు యశ్వంతరావుని కలిసి అంబేద్కర్ చితాభస్మాన్ని బొంబాయి నుండి తెచ్చి అంబేద్కర్ భవన్‌లో భద్రపరిచాం. కోట్లాది దీనజనగొంతుల్ని రగిలించిన ఆ యోధుడి చితినుంచి పిసరంతైనా స్ఫూర్తి పొందే వుద్దేశంతోనే అలా చేసా కానీ గుడ్డిభక్తితో కాదు. అలాగే బోధిగయ నుంచీ విగ్రహాలు తెప్పించి ఇక్కడ ప్రతిష్ఠిస్తున్నాం. ఇక లెక్కలేనన్ని సభలు, సమావేశాలు ఏర్పాటు చేసా. అనేక అంబేద్కర్, బౌద్ధ పత్రికలకూ, పుస్తకాలకూ ఎంతగానో సహకరించాను. ఇలా చెబితే చాలా ఉన్నాయి.

ప్ర) ఉద్యోగం గురించి చెప్పండి?

జ) ఇంటర్ చదూతూనే ఉద్యోగానికి ఎంపికై మద్రాసు వెళ్ళి కొంతకాలం చేసా. తర్వాత్ కాలేజీలో, ఆంధ్రా యూనివర్సిటీలో ఉపాధ్యాయుడిగా, లెక్చరర్‌గా, ప్రొఫెసర్‌గా చివరికి వార్డెన్‌గా ఎన్నో పాత్రలు నిర్వహించాను.

ప్ర) బౌద్ధ సంఘాల్లో అగ్రకులాధిపత్యం వుందనే విమర్శపై మీరేమంటారు?

జ) నాకు తెల్సి అలాంటిదేమీ లేదు.

ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం చీలికపీలికలకు కారణాలేమిటి?

జ) స్వార్థం, నాయకత్వ పిపాస వలనే ముఠాలేర్పడుతున్నాయి.

ప్ర) అంబేద్కర్ బౌద్ధం సరికాదనే వాదన ఈమధ్య వినిపిస్తోంది. దానిపై...?

జ) అంబేద్కర్ బౌద్ధం సరికాదనం సరికాదు. అదే సరైన బౌద్ధం.

ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా పురుషాధిక్యత వుందనీ అందుకే స్త్రీలసంఖ్య స్వల్పమనే విమర్శపై మీ స్పందన?

జ) స్త్రీలు ఉన్నారు గానీ నాయకత్వ స్థానాలన్నీ ప్రధానంగా మగాళ్ళ చేతుల్లోనే వున్నాయి. ఈ స్థితి మారాలి.

ప్ర) పైకి గొప్ప గొప్ప మాటలు చెప్పే పెద్ద మనుషులంతా వ్యక్తిగత జీవితాల్లో దిగజారుడు ధోరణి విడనాడకపోవడమే ఉద్యమంలోని లోపమనే విమర్శపై...?

జ) ఈ విషయంలో లోపమున్నమాట నిజమే, సరిచేసుకో ప్రయత్నించాలి.

ప్ర) ఇక చివరగా బౌద్ధం ఈనాటికీ ఎందుకవసరమో చెప్పండి?

జ) అంబేద్కరు కొలంబియా యూనివర్శిటీలో చదివి 100 సం॥రాలు ఐన సందర్భంగా ఏర్పాటు చేసిన సమావేశానికి పిలిచిన అతి కొద్దిమందిలో మా అల్లుడు సత్యపాల్ ఒకరు. అలాగే కూతురూ, కొడుకూ అందరూ బౌద్ధోద్యమానికి తోడ్పడుతున్నారు. నా భార్య వమంతకమణి సహకారం మరువలేనిది. అంబేద్కర్ మిషన్ నెలకొల్పి ఎన్నో కార్యక్రమాలు చేస్తున్నాం. ఇంటర్నేషనల్ అవార్డు మొదలుకొని ఎన్నో పురస్కారాలొచ్చాయి. ప్రపంచానికి, ముఖ్యంగా భారద్దేశానికి బౌద్ధం తప్ప వేరే మార్గం లేదు. కోట్లాదిమంది అణగారిన ప్రజలు ఆత్మగౌరవంతో తలెత్తుకుని బతికే వాతావరణాన్ని అహింసాత్మక విధానంలో కల్పించగల సత్తా, సత్యాన్వేషణా దృష్టిగల బౌద్ధధమ్మంతోనే సంభవం. కావున దళిత బహుజన తాడిత పీడిత ప్రజలందరికీ బౌద్ధాన్ని అనుసరించడమే శరణ్యం.



ప్రముఖ బౌద్ధ రచయిత

# బోధచైతన్యగారితో

ఇంటర్వ్యూ

**ప్ర) బౌద్ధాభిమానిగా ఎలా మారారో చెప్పండి?**

జ) మాది తమిళనాడులోని పొన్నేరు దగ్గర వెళ్ళూరనే గ్రామం. అక్కడ 1946లో పుట్టాను. పాఠశాల, కళాశాల విద్యానంతరం మద్రాసులో తెలుగు ఎమ్.ఏ. చేసాను. జిడ్డు కృష్ణమూర్తి తత్వం మొదలుకొని వేదాంతం వరకూ మత సాహిత్యమంతో చదివాను. కాళహస్తి శుకబ్రహ్మాశ్రమంలో 4 సం॥రాలు, వ్యాసాశ్రమంలో 4 సం॥రాలు ఉన్నా. షేర్‌బాట్స్కీ, షోపెన్ హెూవర్ మొదలైన మహానుభావుల రచనల ప్రభావంతో బౌద్ధాభిమానిగా మారాను.

**ప్ర) రచనా వ్యాసంగంలో కెలా ప్రవేశించారు?**

జ) రామకృష్ణ మఠంలో నుండగా కొన్ని రచనల్చేసాను. అలాగే వేదాంతభేరి పత్రికలో 70 కథల దాకా రాసాను. టి.టి.డి. వారు బౌద్ధం, జైనం, సిక్కు సాహిత్యాల్ని సైతం హిందూమతంలో భాగమేనని భావించడంతో 'ధర్మపథం కథలు' పేర్తో వో శిష్యురాలు అనుకోకుండా ఇచ్చిన కొంత డబ్బుకి టి.టి.డి. గ్రాంటు కలిపి 3 వేల ప్రతుల్ని బీడీకట్టలపై లేబిల్స్ వేసే ప్రెస్సులో ముద్రించగలిగాను. 'జాతకమాల' అనే పుస్తకాన్ని ప్రజల్లోకి వెళ్ళడం కోసం గ్రామగ్రామానా స్వయంగా నేనే తీసుకెళ్ళి పంచేవాడ్ని. నా పుస్తకాలకు అనూహ్యమయిన స్పందన రావడంతో ఆనందబుద్ధ విహార్‌వారు పరిచయమయ్యారు. ఆ క్రమంలోనే ధమ్మదీపం ఆంజనేయరెడ్డిగారు నాకు ఉత్తరం రాసి పరిచయం చేస్కుని నా గ్రంథ ప్రచురణా బాధ్యతను తీసుకున్నారు. అలా ఇప్పటికి 8 అనువాదాలు వచ్చాయి.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం చీలికలకు కారణమేంటని మీ భావం?**

జ) వ్యక్తిగత అహంకారం, కీర్తికాంక్షలే నాకు తెలిసీ చీలికలకు మూలం.

**ప్ర) బుద్ధుని కాలంలోనే ఆయనతో చర్చించి భిక్కునీ సంఘాన్నీ స్థాపించిన చరిత్రుండగా, ఈరోజున అసలు బౌద్ధసంఘాల్లో స్త్రీలే కానరావడంలేదు. ఇది పురుషాధిక్యతకు నిదర్శనం కాదా?**

జ) స్త్రీలు లేకపోవడం స్పష్టంగా కనిపిస్తోంది. అది ఒప్పుకుని తీరాల్సిందే.

**ప్ర) మీపై ఇంకెవరెవరి ప్రభావం ఉంది?**

జ) వెంకటగిరికి చెందిన 'సత్యజ్ఞాన సంఘం' స్థాపకులు పెంచలయ్యగారితో జరిగిన పరిచయం నా జీవితాన్నే మలుపు తిప్పింది. ఆయనేసిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోయిన నేను ఆ దెబ్బతో తర్కశాస్త్రం చదవడం మొదలెట్టా. అలాగే అప్పుడు సీతానగరం లో వుండే సత్యాన్వేషణ మండలి స్థాపకులు పుట్టా సురేంద్రబాబుగారితో కూడా కొద్దిరోజులున్నాను. పెంచలయ్యగారు నాకంటే పెద్దవారైనప్పటికీ ఎంతో స్నేహంగా వుండేవారు, కాని సురేంద్రబాబు గారు క్రమశిక్షణా యుతమైన పెత్తనాన్ని చెలాయించేవారు. అది నాకు నచ్చేది కాదు. ఐనా మా మధ్య భేషజాలేవీ రాలేదనుకోండి.

**ప్ర) బౌద్ధాన్ని నిష్పక్షపాతంగా అధ్యయనం చేసి బౌద్ధులుగా మారుతున్నవారికంటే అంబేద్కర్ స్వీకరించాడు కాబట్టి దానిని అనుసరిస్తున్నవారే ఎక్కువనే వాదన వుంది. మీరేమంటారు?**

జ) బౌద్ధ కార్యక్రమాలు చేసేవారంతా బౌద్ధాన్ని అధ్యయనం చేసినవారు కారు. ఎంతవరకూ అర్థం చేసుకున్నారనేది కూడా ప్రశ్నే. ఐతే, బౌద్ధం వెయ్యిమెట్లు గల సరస్సులాంటిది. ఏ మెట్టుద్వారానైనా అందులో ప్రవేశించవచ్చు. ప్రాచీన గ్రీకు నగరం తీబ్స్‌లోకి ప్రవేశించడానికి వంద ద్వారాలుండేవి. ఏ దార్లో వెళ్ళినా నగరం నడిబొడ్డుకి చేరేవారు. అలా, అంబేద్కర్ కూడా అందుకొక మార్గమే.

**ప్ర) నేటి బౌద్ధ సంఘాలకూ, హిందూ భజన సంఘాలకూ తేడా లేదనే విమర్శుంది. దానిపై మీ స్పందనేమిటి?**

జ) దుఃఖానికి అన్వేషణతోనే బౌద్ధం జన్మించింది. అలాంటి బౌద్ధానికి ప్రాతిపదిక ప్రేమే తప్ప ద్వేషం కాదు. బౌద్ధులకి ఏ మతంపైనా ప్రత్యేకంగా ద్వేషం ఉండనక్కర్లేదు. జాలీ, దయా, మైత్రీ, కరుణ, ముదిత ప్రధాన అంశాలుగా కలిగిన బౌద్ధం హైందవాన్ని అసహ్యించుకుంటుందనీ, బ్రాహ్మణులకి ప్రత్యేకంగా వ్యతిరేకమనీ చేస్తున్న ప్రచారాలన్నీ అసత్యాలే. సత్యం, అహింస ప్రధానంగా జీవించే వ్యక్తి అతడే మతస్థుడైనా బౌద్ధుడే. జర్మన్ రచయిత షోపెన్ హెూవర్ 'World as will and representation' అనే అద్భుత గ్రంథాన్ని బౌద్ధుడిగా మారక మునుపే రాసాడు.

**ప్ర) ఈ దేశంలో బౌద్ధ పతనానికి కారణాలేంటి?**

జ) అది నేను చెప్పనుగానీ ఇకిప్పుడు బౌద్ధం అంతరించిపోతుందని విచారించనక్కర్లేదని మాత్రం కచ్చితంగా చెప్పగలను. ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న బౌద్ధాన్ని అడ్డగించడం ఈరోజంత సులువు కాదు.

**ప్ర) వ్యక్తిగతంగా, కుటుంబ పరంగా స్వార్థపరులూ, దిగజారినవాళ్ళూ బౌద్ధ సంఘాల్లో నాయకులుగా చలామణీ అవడంపై మీ భావన?**

జ) బౌద్ధం యొక్క మౌలిక ఉద్దేశం మనిషి తనను తాను తెల్సుకోడం. కావున బౌద్ధుడిగా మారాక అవలక్షణాలన్నిట్నీ విడనాడాల్సిందే.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం అగ్రవర్ణ కులహంకారమే బుసలు కొడుతోందనీ, అందువల్లే ముఠా రాజకీయాలు నడుస్తున్నాయనే విమర్శపై మీ భావన?**

జ) టిబెట్‌లాంటి దేశంలో చంద్రకీర్తి రాసిన మాధ్యమికవతారానికే 300లకు పైగా వ్యాఖ్యానాలున్నాయి. ఎవరి ఆలోచనలు వారివి. ఇక కులాల విషయానికొస్తే వ్యక్తిగతంగా నాకే సంఘంతోనూ పెద్దగా పరిచయం లేనందున ఈ విషయాలు నాకు తెలీవు.

**ప్ర) మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?**

జ) ఏవో అనువాదాలు చేసుకోవటమే కాని ఇంకే పనులూ నాకు లేవు.

**ప్ర) చివరగా ఈరోజు బౌద్ధధమ్మావశ్యకత ఎంతో, ఎందుకో చెప్పండి?**

జ) సత్యానికి భావమే తప్ప భాషతో పనిలేదు. అలాంటి సత్యాన్వేషణా దృష్టికల బౌద్ధానికే భవిష్యత్తు. థేరవాదంపై రచనలు చేసినప్పటికీ మహాయానంలోని మాధ్యమిక తత్వాన్నే నేనిష్టపడతాను. నా దృష్టిలో ఆధ్యాత్మికంగా తర్కానికి పెద్దగా విలువలేదు, మానవీయ మతానికే ప్రత్యేకమైన ప్రయత్నాల్తో పన్లేదు. దానికదే అభివృద్ధి చెందుతుంది. అష్టాంగమార్గం, పంచశీలల్ని మించిన నైతిక మార్గం లోకంలో ఎక్కడా కానరాదు. అలాంటి లక్షణాల్ని తనలో ఇముడ్చుకున్న బౌద్ధం కాలాతీత కాంతిరేఖ.



## మైత్రేయ బుద్ధవిహార స్థాపకులు

# మహోదయ (యా.జ.రా.) గారితో

## ఇంటర్వ్యూ

**ప్ర) మీ బౌద్ధధమ్మ ప్రస్థానం గురించి చెప్పండి?**

జ) నేను కృష్ణాజిల్లా పెడనం మండలం నందిగం అనే గ్రామంలో 1956, అక్టోబర్ 14న వ్యవసాయ కుటుంబంలో పుట్టాను. కూలీనాలీ చేస్తూ ఎస్సెస్సీ పూర్తి చేసాను. తర్వాత ఏలూరొచ్చి రేడియో యింజనీరింగ్ ట్రైనింగ్‌లో జాయినై దాని నిర్వాహకుల మోసంతో అది మూతపడ్డంతో కొన్నాళ్ళు వాచ్‌మేన్‌గా, టెలిఫోన్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసి 19 ఏళ్ళకే కానిస్టేబుల్ ఉద్యోగాన్ని పొందా. అంతకుముందు నుంచే సుప్రసిద్ధ నాస్తికనేత గోరాగారితో నాకు పరిచయముండేది. పి. రజనీగంగాధరనే (ఇప్పుడు ప్రముఖ రచయిత) మిత్రుడితో కల్సి 'ఉజ్వల' అనే రాత పత్రికను నడిపేవాడ్ని. హేతువాద, కులనిర్మూలనా, వామపక్ష సంఘాల కార్యక్రమాల్లో పాల్గొంటూ ఆ క్రమంలోనే బౌద్ధాభిమానిగా మారాను.

**ప్ర) ఆ కాలంలో మిమ్మల్ని ప్రభావితం చేసిన వారెవరు?**

జ) చాలా మందున్నారు. దిగంబర కవులు మొదలుకొని నార్ల, ఏబికె, శ్రీశ్రీ, గురజాడ వంటి వారి ప్రభావం నామీదుండేది. సూర్యాపేట కేంద్రంగా నాస్తిక కేంద్రం నడిపిన ఖానాగారు, చార్వాకాశ్రమ స్థాపకులు రామకృష్ణగారు, మల్లాది వెంకట రామ్మూర్తిగారు మొదలైనవార్తో సంబంధాలు ఉండేవి. సుమారు 10 సం॥రాలబాటు మహోదయ్ అనే కలం పేరుతో రత్నగర్భ, స్టేట్‌టైమ్స్, ఏలూరు టైమ్స్, గాండీవం, తెల్లజెండా, నాస్తికయుగం, చార్వాక, యువజన, వికాసం, ప్రజాధికారం, మూక్‌నాయక్ మొదలైన పత్రికల్లో రచనలు చేయడమే కాక వాటి ప్రచురణకు సహకరించేవాడ్ని కూడా.

'నవచైతన్య' అనే సాహిత్య సాంస్కృతిక సంఘాన్ని భీమడోలులో స్థాపించి, 10 సంవత్సరాలు ప్రగతిశీల కార్యక్రమాలతో నడిపాను. అలాగే మార్క్స్, శ్రీశ్రీ మొదలైనవారిపై కరపత్రాలు ప్రచురించా. నాగభూషణ్ పట్నాయక్ లాంటి ఉద్దండ విప్లవకారులు సైతం నన్ను పిల్చి చర్చించేవారు.

ప్ర) మీ ఉద్యోగ సంబంధ విషయాలు చెప్పగలరా?

జ) కానిస్టేబుల్‌గా చేస్తూనే హెడ్ కానిస్టేబుల్‌గా ప్రమోటై 7 సం॥రాలు పనిచేసి ఎస్.ఐ.గా సెలక్టయ్యాను. అంతకుముందే అనేక డిగ్రీలు చేసాను. నీతినిజాయితీగా వుంటూ లంచాలు తీసుకోకపోవడంతో 20 సం॥రాలు పన్చేసాకే సి.ఐ.గా మారాను. తర్వాత రిటైరయ్యా.

**ప్ర) బౌద్ధసంఘాలు కూడా మఠ నిలయాలుగా అగ్రకుల పెద్ద మనుషులతో కూడిన భజన సంఘాలుగా మారాయనే వాదనపై మీ భావం?**

జ) బౌద్ధసంఘాల్లో కులమున్నమాట నిజం. అందుకే ఐక్య ఉద్యమాలు సాధ్యమవడం లేదు. మఠ రాజకీయాల బెడద కూడా ఇందుక్కారణం.

**ప్ర) మైత్రేయాశ్రమ స్థాపనకు దారితీసిన పరిస్థితులేమిటి?**

జ) ఏలూర్లో మొట్టమొదటి హేతువాద మహాసభ నిర్వహించేనాటికే కులనిర్మూలనోద్యమాలతో నాకు గట్టి సంబంధముంది. అంబేద్కర్‌ను లోతుగా అధ్యయనం చేసి ఈ దేశంలో కులం పోకుండా ఏ ఉద్యమం కూడా విజయవంతం కాదని తెల్సుకుని తద్వారా బౌద్ధప్రచారం కోసం 1988లోనే Buddhist Society Prospects అనే సంఘాన్ని స్థాపించి బౌద్ధధమ్మ పరిచయమనే చిన్ని పొత్తాన్ని లక్షల సంఖ్యలో ప్రచురించి పంచాను. కొడవలి బౌద్ధక్షేత్రాన్ని బాగుచేయించాను. అనేక కరపత్రాలు, గ్రంథాలు ముద్రించాను. అవినీతికి సహకరించని ఉద్యోగులకు ఈ దేశంలో ట్రాన్స్‌ఫర్లు, వేదింపులు, బెదిరింపులే బహుమతిగా లభిస్తాయనే నిజం తెల్సిందే కాబట్టి అనేక ఇబ్బందులకు లోనై వివిధ ప్రాంతాల్లో విపశ్యనా ధ్యాన కేంద్రాల్ని స్థాపించే యత్నం చేసి అవి కుదరకపోవడంతో విరమించుకుని ప్రత్యామ్నాయ భావజాల ప్రచారోద్యమాలకో ముఖ్య కేంద్రంగా వేమగిరి వద్ద మొదట ఎకరం స్థలం కొని 1996లో మైత్రేయ బౌద్ధ విహారాన్ని స్థాపించాను. ఉద్యోగంలో సంపాదించిన డబ్బులో దాదాపు

అత్యధికశాతం దీనికే వెచ్చిస్తూ అద్భుతమయిన ముగ్ధాశ్రమంగా తీర్చిదిద్దేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తున్నా.

**ప్ర) బౌద్ధసంఘాల్లో సైతం పురుషాధిక్యతే అమలౌతోందనే విమర్శపై మీరేమంటారు?**

జ) మీరడుగుతుంటే నిజమేననిపిస్తోంది. స్త్రీలు ఎక్కువమంది లేరు. అయితే మొత్తంగా చూసినప్పుడు బౌద్ధుల సంఖ్యే చాలా తక్కువ కాబట్టి స్త్రీల సంఖ్య సహజంగానే తక్కువుండటం ఆశ్చర్యమేమీ కాదు.

**ప్ర) బయట పెద్ద పెద్ద మాటలు చెప్పే బౌద్ధులు వ్యక్తిగత, కుటుంబ విషయాల్లో దిగజారుడుతనాన్ని అవలంభించడమే యిందుక్కారణమంటే ఏమంటారు?**

జ) పురుషాధిక్యతా, అలాగే వ్యక్తిగత స్వార్థాలు ఉన్నమాట నిజమే. అందుకే స్త్రీలూ, యువతా రావట్లేదు. దీనిపై దృష్టిపెట్టాల్సినవసరం వుంది.

**ప్ర) మీ కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ) రచనా వ్యాసంగం తగ్గిపోయింది. క్షేత్రస్థాయి కార్యక్రమాలపై దృష్టి పెట్టా. కొన్నాళ్ళు ఉచిత పాఠశాల, వృద్ధాశ్రమం కూడా నడిపాను. ఔషధమొక్కలు పెంచడం మొదలుకుని అన్నార్తులను ఆదుకోడం దాకా ఎన్నో ప్రజాహిత కార్యక్రమాలు చేస్తున్నా. ఇప్పటికి 58 సార్లు రక్తదానం చేసా. బుద్ధుని దివ్యవిగ్రహంతో సహా అశోకుడి వరకూ దార్శనిక మనోహర మూర్తుల్ని ఆశ్రమంలో ప్రతిష్టిస్తున్నా. అలాగే కుదిరితే భవిష్యత్తులో 'శూద్ర' అనే పత్రిక పెట్టాలనుకొంటున్నా.

**ప్ర) బౌద్ధుల్లో విగ్రహారాధనపైగల విమర్శలపై మీ స్పందన?**

జ) విగ్రహారాధనకీ, విగ్రహస్ఫూర్తికి వ్యత్యాసముంది. వ్యక్తుల్ని దైవాలుగా మార్చి మూఢభక్తితో చేసే గుడ్డి విగ్రహారాధనా, వ్యక్తుల ఆలోచనల్నీ, ఆచరణనీ ఆదర్శంగా తీసుకుని మన కార్యాచరణను నిర్దేశించే హేతుబద్ధ భావనా ఒకటి కావు. అవయవాల పొందికతో కూడిన విగ్రహమూర్తుల్ని పూజించడం కంటే భావాల ఐక్యత కోసం వోదార్పునిచ్చే ప్రతిమల్ని ప్రజాస్వామిక స్ఫూర్తితో

గౌరవించడం తప్పుకాదు. అందుకే అత్యధికశాతం బహుజనుల కోసం పాటుపడిన బుద్ధుడు, అంబేద్కర్‌ల విగ్రహాలు ఆత్మగౌరవ సంకేతాలే గుడ్డిభక్తి చిహ్నాలు కాదంటాన్నేను.

ప్ర) **ఇక చివరిగా బౌద్ధం ఈరోజెందుకవసరమో చెప్పండి?**

జ) అట్టడుగునుంచి వచ్చి బౌద్ధాభిమానులుగా మారిన రేపల్లె సామ్యూల్ జాన్ గారు, తెలంగాణా అంబేద్కర్ భూషి గారు, చిరువెళ్ళ రాఘవరావుగారు, లియాకత్ అలీగారు, శివనాగిరెడ్డిగారు, రఘుపతిరావుగారు, పిల్లి రాంబాబుగారు, ధర్మచక్ర హరిప్రసాద్ బోధిగారు, మహానాగ వామనానంద గారు, రాయదుర్గం విజయలక్ష్మిగారు, చెల్లపల్లి స్వరూపారాణిగారు, కత్తి పద్మారావుగారు, కంచి ఐలయ్యగారు, జనమిత్ర విష్ణుమూర్తిగారు, ఇండియన్ బుద్ధిస్టు బెవర వీరభద్రరావుగారు, రసరేఖ సంపాదకులు ముంగర జాషువాగారు, డాక్టర్ వావిలాల సుబ్బారావుగారు, మల్లేపల్లి లక్ష్మయ్యగారు, రేగుళ్ళ మల్లికార్జునరావుగారు ఇంకా ఎంతోమంది బౌద్ధాభిమానులున్నారు. దీనజనోద్ధారణే ప్రధాన ధ్యేయమైన బౌద్ధం ఈరోజు మరింతవసరం. సత్యం, అహింస, కరుణ, ప్రేమ, ప్రతీత్య సముత్పాదంతో కూడిన స్వేచ్ఛాసమాజ స్థాపనే నా ఆశ్రమ లక్ష్యం. జగన్నాధరావుగారి లాంటి మిత్రుల ప్రోత్సాహంతో ఈ దేశ ప్రజల్లో లోతుగా జీర్ణించుకునిపోయిన సి.సి.సి.పి. (Caste, Creed, Corruption and Politics)ల్ని నాశనం చేసి నాలోని ప్రతి కణం ప్రతిక్షణం మానవతావాదమైన బౌద్ధధమ్మ వ్యాప్తికి వెచ్చించడమే నా జీవిత లక్ష్యం.





ధమ్మదీపం ఫౌండేషన్ వ్యవస్థాపకులు

# చెన్నూరు ఆంజనేయరెడ్డిగారితో

ఇంటర్వ్యూ

ప్ర) బౌద్ధోద్యమకారునిగా మీ పయనమెలా మొదలైందో చెప్తారా?

జ) మాది నెల్లూరు, కానీ 50 సం॥లుగా హైద్రాబాద్‌లోనే స్థిరపడ్డా. చదువయ్యాక పి.జి. చేసి మేథ్స్‌లో మాస్టర్స్ చదివా. పెరియార్ రామస్వామి ప్రభావంతో నాస్తికుడిగా మారాను. జిడ్డు కృష్ణమూర్తి మొదలుకొని అనేకమంది తత్వాల్ని తెల్సుకున్నాను. ఐసిఎస్ చదువులో భాగంగా చరిత్రని అధ్యయనం చేసాను. 1986 నుంచి బౌద్ధాన్ని అధ్యయనం చేయడం ఆరంభించి ఆ క్రమంలోనే జిడ్డుకృష్ణమూర్తి గార్నుంచీ అనేకమంది చెప్తోంది బౌద్ధసారమేనని గ్రహించి దలైలామా గార్ని కల్సి బౌద్ధుడినయ్యాను.

ప్ర) మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?

జ) అప్పట్లో 'సుహృల్లేఖ' అనే మాసపత్రిక నడిపాను. అనేక గ్రంథాల్ని ప్రచురించి, చాలామంది భిక్షువుల్ని తయారుచేసాను. 1984లోనే విశాఖపట్నంలో విశాఖ బుద్ధ విహార మొదలెట్టాను. అలాగే అమరావతిలోనూ, ఇబ్రహీం పట్నం దగ్గరా బౌద్ధవిహారాల స్థాపనకి తోడ్పడ్డాను. మహాబోధి బుద్ధవిహార ట్రస్టును అభివృద్ధి చేసాను. ధమ్మదీపం ఫౌండేషన్ ద్వారా అనేకమైన అమూల్య పాళీబౌద్ధ సాహిత్యాన్ని తెలుగువారికి అందిస్తున్నాం. మిసిమి మాసపత్రికను అనితర సాధ్యంగా దార్శనిక దృక్పథానికి ప్రతీకగా నడుపుతున్నాం. ప్రభుత్వాన్ని ఒప్పించి బుద్ధజయంతిని అధికారికంగా పట్టించుకునేలా చేసాం. శిధిలావస్థకు చేరువైన ఎన్నో పురాతన బౌద్ధ కట్టడాల్ని పరిరక్షించే బాధ్యత తీసుకొని ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తున్నాం. అలాగే నాగార్జునసాగర్ వద్ద ఓ గొప్ప బౌద్ధనిర్మాణ ప్రాజెక్ట్ పనిలో ఉన్నాను.

ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా చీలికపేలికలకు కారణాలేంటి?

జ) సంఘాలెన్నున్నా సారాంశం ఒక్కటే. బౌద్ధ సంఘాలే అంతంత మాత్రంగా

ఉన్నాయి. ఇక అందులో చీలికలేమిటీ? ఎన్ని బౌద్ధ సంఘాలకైనా ప్రధానమైన తాత్విక భూమిక విషయంలో పేచీలేదు.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం కులం ముఖ్యపాత్ర వహిస్తోందనీ అగ్రకులాధిపత్యం చలామణీ అవుతోందనే వాదనపై మీరేమంటారు?**

జ) కులాన్ని గుర్తించడం బౌద్ధం కాదు. ఇలాంటి కూతలన్నీ అర్థంలేనివి, పనికిమాలినవి, హిందూ జాతి జాడ్యాన్ని వొదుల్చుకోలేనివాళ్ళు పట్టుకుని వేలాడేవి. నేను ముక్కుసూటి మనిషిని, ముసుగులో గుద్దులాటలు నాకు నచ్చవు. ఏదైనా వుంటే డైరెక్ట్‌గానే చెబుతా.

**ప్ర) రాష్ట్రంలోని బౌద్ధసంఘాల్లో రెడ్డికుల ఆధిక్యత ఎక్కువైందనీ ఇతర కులాలవారికి కార్యనిర్వాహక స్థానాల్లో అవకాశమివ్వడం లేదనే వాదనపై మీ భావన?**

జ) ఇలాంటి మాటలు మాట్లాడేవారంతా మూర్ఖులు, సన్నాసులు, దుర్మార్గులు. పట్టుమని పదిమంది కూడాలేని రెడ్ల గురించి ఈ వాదనెందుకు.

**ప్ర) పేర్లముందు పిలకలూ, పేర్లచివర తోకలూ పెట్టుకునే వాళ్లంతా బౌద్ధులుగా చలామణీ అవడం ఎంతవరకూ సమంజసం?**

జ) ఇలాటివన్నీ పనికిమాలిన వాళ్ళూ, సన్నాసులూ అనే మాటలు. బౌద్ధంలో అసలు కులప్రసక్తే లేనప్పుడు యివన్నీ ఎలా వుంటాయి.

**ప్ర) కార్యకర్తలకీ, అణగారిన ప్రజలకూ లేని కులం నాయకులకింకా ఎక్కడో అంటుకుని వుండిపోబట్టే మార్పు సాధ్యం కావట్లేదనీ...?**

జ) ఇవన్నీ మాట్లాడేవాళ్ళు సన్నాసులు, పనికిమాలినవాళ్ళు, దొంగలు... ఏదైనా వుంటే డైరెక్ట్‌గా అడగండి.

**ప్ర) మీ పేరు చివర రెడ్డి, బౌద్ధుడిగా మారాక ఎందుకు తొలగించుకోలేదు?**

జ) ఎందుకు తొలగించుకోవాలి? రెడ్డి అనేది జాతి చిహ్నామే కాని కుల చిహ్నాం కాదు. గోపరాజు రామచంద్రరావుగారని పిల్చుకునే గోరాగారూ, కవిరాజుగా పేరొందిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారూ పేరు మార్చుకోనంతలో వారి సామాజిక విప్లవ దృక్పథం మరుగైపోతుందా? తల్లిదండ్రులు పెట్టిన పేరుని ఎందుకు మార్చాలి. బౌద్ధ భిక్షువుగా మారితేనే ఇవి వర్తిస్తాయి.

**ప్ర) వ్యక్తిగత జీవితంలో సహృదయతనూ, సద్భావాన్నీ సాధించలేని కోపిష్టులు, దిగజారుడు వ్యక్తిత్వం కలవారి వల్లే బౌద్ధప్రచారం కుంటుపడుతోందనే విమర్శపై మీ అభిప్రాయం?**

జ) అలాంటి వారి వల్ల కొద్దిగా నష్టమున్నప్పటికీ మొత్తంగా చూసినప్పుడు బౌద్ధధమ్మ అభివృద్ధిని ఇలాంటి కారణాలు అడ్డుకోలేవు.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా పురుషాధిక్యతే రాజ్యమేలుతోందనీ స్త్రీలను 2వ తరగతి వ్యక్తులుగానే పరిగణిస్తున్నారనే వాదనపై మీ భావన?**

జ) ఇలాంటివన్నీ శుంఠలూ, పనికిమాలినవాళ్ళు, సన్నాసులు కూసే కూతలు. ఎంతోమంది స్త్రీలున్నారు. బౌద్ధాన్ని మొదట్నుంచీ ఆదరించింది స్త్రీలే.

**ప్ర) మరి, బిక్కు సంఘాలన్ని ఉండగా ఒక్క బిక్కుణీ సంఘం కూడా లేక పోవడానికి, కనీసం బౌద్ధ స్త్రీ సంఘాలు అభివృద్ధి కాకపోడానికీ కారణమేంటి?**

జ) కారణాలు చాలానే ఉన్నాయి. బౌద్ధం మేధోమతం. ఇతర మతాల్లా ఎక్కువ క్రతువులిందులో కనిపించవు. కాబట్టి స్త్రీల దృష్టిని ఆకర్షించకపోవచ్చు.

**ప్ర) భారద్దేశంలో బౌద్ధపతనానికి దారితీసిన పరిస్తితులు చెప్పగలరా?**

జ) ఎన్నో కారణాలున్నాయి. అదో పెద్ద చర్చ. ఇలా చెప్పేది కాదది.

**ప్ర) మీ లక్ష్యం గురించీ, బౌద్ధం ఈనాడెంత అవసరమో దాన్ని గూర్చి చెప్పండి?**

జ) ఒక మతంపై ద్వేషంతో మరోమతం తీసుకోడం అశాస్త్రీయం. మధ్యేమార్గం బౌద్ధమతసారం, జగత్తుకదే శరణ్యం. మంచి బౌద్ధుడిగా వుండడానికి సత్యాన్వేషణా పథంలో వుండటమే అర్హత కానీ పేరుప్రఖ్యాతులు కాదు. నైతికత బౌద్ధానికి ప్రాణం, కావున భారద్దేశం ఆధ్యాత్మికంగా బతకడానికి బౌద్ధం చాలా అవసరం. అలగే ధ్యానం లేకుండా బౌద్ధం లేదు. దేశంలో శాస్త్రీయ దృక్పథం పెరిగితే అశాస్త్రీయ మతాలన్నీ అంతరిస్తాయి. బౌద్ధమొక్కటే మిగులుతుంది. ప్రస్తుతం త్రిపీఠకాల్ని తెలుగనువాదం చేయిస్తున్నా. కొన్ని వ్యాసాలు, రచనలు చేసాను. కనీసం 100 పై చిలుకు బౌద్ధ గ్రంథాల్ని ప్రచురించాలనేది నా ఆకాంక్ష, నా కార్యక్రమాల్లో వీరనారాయణ రెడ్డిగారు, శివనాగిరెడ్డిగారు ఇంకా ఇతరులు తోడ్పడుతున్నారు. వారికి నా ధన్యవాదాలు. సెలవు.



అంబేద్కర్ అభిమానీ, బౌద్ధ బిక్కుణీ

## కె.ఎస్. భారతీబాయి కాంబ్లేగారితో

ఇంటర్వ్యూ

**ప్ర) బౌద్ధంలోకి మీరెలా ప్రవేశించారు?**

జ) పుట్టుకతోనే అంబేద్కరైట్‌ని, అంబేద్కర్ తర్వాత బుద్ధుడే మాకు ఆరాధనీయుడు. అలా చిన్నప్పట్నుంచే బౌద్ధాభిమానిని.

**ప్ర) అంటే, మీ తల్లితండ్రులు అంబేద్కరిస్టులా?**

జ) అవును, మా నాన్నగారు సిద్ధరామ్ కాంబ్లే, అమ్మ ఐవాభాయి కాంబ్లే. నాన్న పోలీసు శాఖలో ఉద్యోగం చేసేవారు. చాలాకాలం ఉస్మానాబాద్‌లో ఉండేవాళ్ళం. నాన్నకి బాబాసాహెబంటే ఎంత భక్తిశ్రద్ధలంటే, ఆయన ప్రసంగాలన్నింటికీ పనికట్టుకుని వెళుతూండేవారు. అలా వోసారి అశేష ప్రజానీకం అభిమానంతో ఒళ్ళుతెలీక అంబేద్కర్ మీద పడగా ఊపిరందక అతడుక్కిరిబిక్కిరి అవుతోంటే మానాన్న తన పిస్టల్‌తో గాల్లోకి కాల్పులు జరిపి జనాన్ని చెల్లాచెదురు చేసారట. అప్పుడు బాబాసాహెబ్ నాన్న వెన్నుతట్టి ఏమైనా కావాలా అని అడిగితే నాన్న మీ సంతకం కావాలనడిగితే ఆయన మా నాన్న చేతిపై 'జైభీమ్' అని రాసారట. దానిపై పచ్చబొట్టు పొడిపించుకున్న మా నాన్న జీవితాంతం ఈ కథని అది చూపిస్తూ ఎంతోమందికి గర్వంగా చెబుతుండేవారు.

**ప్ర) మీరు చేస్తున్న కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ) నాన్న, అమ్మతో కల్సి బౌద్ధంలోకి మారాక వివిధ కార్యక్రమాలు చేస్తున్నా. నాన్నగారి ఆధ్వర్యంలోనే లుంబినీ బౌద్ధవిహారాన్ని నిర్మించాం. అలాగే మల్కాజ్‌గిరిలో తథాగత బుద్ధ విహారాన్ని 2012లో నిర్మించా. నేను రైల్వేలో

30 సం॥రాలు ఉద్యోగంచేసి రిటైరయ్యాను. మొదట్నుంచీ బౌద్ధధమ్మ ప్రచారానికే కుటుంబమంతా కట్టుబడ్డాం. శ్రావస్థి, సారనాథ్, కుషీనారలో సైతం విగ్రహాలిచ్చి, విహారాలు కట్టించాను.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా చీలికలున్నాయనే విమర్శపై మీ స్పందన?**

జ) బౌద్ధులు ఎక్కడున్నా ఒక్కటే. నాకు తెలిసీ మీరనుకున్నన్ని చీలికల్లేవి బౌద్ధంలో లేవేమో.

**ప్ర) బౌద్ధంలో కూడా కులాలున్నాయని ఒప్పుకుంటారా?**

జ) అస్సలొప్పుకోను... బౌద్ధంలో కులాలు లేవు.

**ప్ర) మరి, బౌద్ధ సంఘాల్లో ఇప్పటికీ అగ్రకులాలే ఆధిపత్యం చెలాయిస్తున్నారనీ, పేర్లముందు పిలకలూ, పేర్ల చివర తోకలూ ఉన్నవాళ్ళే నాయకులుగా చెలామణీ అవుతున్నారనే వాదనపై మీరేమంటారు?**

జ) నిజమే. ఒకవైపు హిందువులుగా, చేతికుంగరాలు, మెళ్ళోగొలుసులూ వేసుకుని మరోవైపు బౌద్ధులుగా ప్రచారం చేసుకుంటున్నవారు ఉన్నారు. అగ్రవర్ణాలూ, అగ్రవర్గాలే కాని అణగారిన వర్గాలు నాయకత్వ స్థానంలో లేరు. ఇక కులాలు లేవంటూ కుల చిహ్నామైన పేర్లతో చెలామణీ అవడం నా అవగాహన ప్రకారం సరికాదు.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం పురుషాధిక్యత ఉందనీ, అందువల్లనే స్త్రీల సంఖ్య స్వల్పమనే విమర్శపై మీ స్పందనేంటి?**

జ) ఇది కచ్చితంగా నిజం. సొంత కుటుంబాలపైనే శ్రద్ధలేని నాయకులంతా టింగురంగా అనుకొంటూ ఒంటరిగా కార్యక్రమాలకి వస్తూ, స్త్రీలూ, పిల్లలూ, యువతా రావడం లేదని ఒగరుస్తారు. చిత్తశుద్ధనేది వుంటే ముందు ఈ పెద్ద మనుషులంతా వాళ్ళ యింటినుంచే ధమ్మప్రచారం చేయాలి.

**ప్ర) అంబేద్కర్‌ది నిజమైన బౌద్ధం కాదనే వాదనపై మీ అభిప్రాయం?**

జ) భౌతికవాదం లేని బౌద్ధం పశుప్రాయం, అంబేద్కరిజం లోపించిన బౌద్ధం అర్థరహితం, అనాలోచితం. అంబేద్కరిజాన్ని మినహాయించి వేరే ఏదో బౌద్ధముంటుందనుకోవడం పెద్ద భ్రమ.

ప్ర) ఇక, చివరిగా మీరేం చెప్పాలనుకుంటున్నారో చెప్పండి?

జ) తల్లితండ్రుల సేవకి ఆటంకమౌతుందని వివాహం కూడా చేసుకోలేదు. నాన్నకి అంబేద్కర్ కొడుకుతో ఉన్నట్లే నాకు ఆయన కోడలితో సాన్నిహిత్యం ఉంది. బొంబాయి వెళ్ళినప్పుడల్లా కల్సివస్తుంటా. ఏదేమైనా అంబేద్కర్ కృషితో రిజర్వేషన్లను అనుభవిస్తూ ప్రత్యేక సౌకర్యాలు పొందుతున్నవారంతా దొంగ మతాల కొంగ వేషాలకి చిక్కి బలౌకుండా బౌద్ధులుగా మారి బౌద్ధోద్యమాల్లో భాగం కావాలి.





## ఆధునిక బౌద్ధ రచయిత

# డా॥ బొర్రా గోవర్ధన్ గారితో

## ఇంటర్వ్యూ

**ప్ర) మీ బౌద్ధోద్యమ ప్రస్థానం గురించి చెప్తారా?**

జ) అంటే ముందు నా భావోద్యమ ప్రస్థానం గురించి ప్రస్తావించాలి. మాది గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా నిజాం పట్నం మండలంలోని కూచినపూడి శివారు బొర్రావారి పాలెం. మాది నిరుపేద గీతకార్మిక కుటుంబం. చిన్నప్పుడు తాతగారూరు తోటపల్లిలో ఉండి చదూకున్నాను. ఆ ఊరంతా సారా కాచేవారు కాని ఊర్లో ఒక్కరు కూడా తాగేవారు కాదు. అలా ఆ గ్రామం శాంతికి నిలయంగా వుండేది. 8వ తరగతి నగరంలోనూ, ఇంటర్ రేపల్లెలోనూ చదివాను. చిన్నప్పట్నుంచే విపరీతంగా సాహిత్యం చదివేవాణ్ని, విద్యార్థి సంఘాల్లో తిరిగేవాణ్ని.

**ప్ర) వామపక్ష ఉద్యమాల ప్రభావం మీపై ఉందా?**

జ) అసలున్నదే అది. మా నాన్నగారు నక్సలైటోద్యమంలో పనిచేసేవారు. ప్రజాసాహితి కొత్తపల్లి రవిబాబు, ఓపిడిఆర్ టి.ఎల్. నారాయణ, సి. భాస్కర్రావు, ఉద్యమాల ఉపాధ్యాయుడిగా పేరొందిన ఉ. సాంబశివరావు మొదలైన వారి ప్రభావం వుండేది. ఇక శ్రీశ్రీ సంగతి చెప్పక్కర్లేదు. మా చిన్నమ్మాయి పేరు కూడా శ్రీశ్రీనే. చివరిదశలో మా ఇంటిక్కూడా ఆయనొచ్చారు.

**ప్ర) మరి చదువెందుకు ఆపేశారు?**

జ) ప్రజాసంఘాలతో పరిగెడుతుంటే చదువెలా సాగుతుంది. అమరావతి కాలేజీలో చేరదామనుకుంటుండగానే విద్యార్థులకీ, పోలీసులకీ గొడవై కాల్పులు జరిగి యిద్దరు ప్రాణాలు కోల్పోయారు. ఇక చదువు సాగలేదు.

**ప్ర) బతకడానికేం పనులు చేసారు?**

జ) చెయ్యని పనంటూ లేదు. చదూతున్న రోజుల్లోనే గుంటూరులో ఒక హోటల్లో పనిచేసేవాడ్ని. తర్వాత అమరావతి దగ్గర మోతడకనే గ్రామంలో కొన్నాళ్ళు సోడాలమ్మికు బ్రతికాను. అలాగే బాపట్లలో రైల్వే గ్యాంగులో పన్చేసా. చిన్నప్పట్నుంచీ మంచి గాయకుడ్ని, నృత్యకారుడ్ని కావడంతో శ్రామికులపై పాటలు కట్టి పాడేవాడ్ని. ఆ క్రమంలో పిల్లలకు ట్యూషన్లు నగరంలో చెప్పడం ఆరంభించీ 85లో 'శాంతి నికేతన్' స్కూల్‌ను స్థాపించీ ఇలా స్థిరపడ్డాను.

**ప్ర) మీ కళాతృష్ణ, రచనా వ్యాసంగానికి కారణమైందనుకోవచ్చా?**

జ) ఏమో, దేనికేదీ కారణమో తెలీదుకాని నా మట్టుకు నాకు దేనికదే యిష్టం. ఒంగోలులోని వో సభలో నా పాట విని తన్మయత్వంలో మునిగిపోయిన కాకరాల పరుగెత్తుకొచ్చి నన్ను ఆలింగనం చేసుకున్న సంఘటన నాకిప్పటికీ జ్ఞాపకముంది. ఇక రచనా వ్యాసంగం విషయానికొస్తే 17వ ఏటనే 'గుండెమంటలు' అనే విప్లవగీతాల సంకలనాన్ని వెలువరించాను. అంతకుముందునుంచే జనసాహితి సభ్యుడిగా ప్రజాసాహితిలో క్రాంతికిరణ్ అనే కలం పేరుతో రచనలు చేసేవాడ్ని. అలా మార్క్సిస్టు దృక్పథం నుంచీ అంబేద్కర్‌ను అధ్యయనం చేసి చివరికి బౌద్ధాభిమానిగా మారాను. అలా ఇప్పటికి అనేకాంశాలపై 70కి పైగా గ్రంథాలు రచించాను. అంతేగాక ఇప్పటికీ ప్రముఖ పత్రికల్లో సీరియళ్ళు, వ్యాసాలు వ్రాస్తున్నా.

**ప్ర) శ్రీశ్రీగారితో మీ అనుబంధం గురించి చెప్పరా?**

జ) మీకు వినే వోపికుండాలే గాని ఆయన గురించి ఎంతసేపైనా చెప్పగలను. శ్రీశ్రీకి కేన్సరని తెల్సి మద్రాసు వెళ్ళా. శ్రీశ్రీ విరసం కాబట్టి సన్మానం చేయడానికి వీల్లేదన్నారని అప్పటికప్పుడు జనసాహితికి రాజీనామా చేసేసా. ఆయన మా ఇంటికొచ్చినప్పుడు ఎంత సంతోషించానంటే అమెరికా ప్రెసిడెంటొచ్చినా అంతగా ఆనందించకపోదును. నా పెళ్ళి తన చేతులు మీదుగా చేస్తానన్న శ్రీశ్రీ తన మాట నిలబెట్టుకోకుండా అర్ధాంతరంగా మరణించడంతో ఆయన స్థానాన్ని వేరెవ్వరికీ ఇవ్వలేక నాకు నేనే పెళ్ళి చేసుకున్నా.

ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం ముఠాలు, చీలికలు ఉన్నాయనే వాదనపై మీ భావన?

జ) నా దృష్టిలో అన్ని చీలికలేవీ లేవు. ఉన్న కొద్దిమందే అనేక పేర్లతో సంఘాలు పెట్టుకున్నంతలో ముఠాలున్నట్లు కాదు.

ప్ర) బౌద్ధ సంఘాలు కూడా అగ్రవర్ణ పెద్ద మనుషులతో నిండి ఉన్నాయనే విమర్శపై మీ స్పందన ఏమిటి?

జ) ఏ ఉద్యమంలోనైనా కొద్దిమంది దేవదత్తులుంటారు. నా దృష్టిలో అగ్రకులాధిపత్యమేదీ లేదు. దళిత బహుజనులే బౌద్ధాన్ని రక్షించుకుంటున్నారు.

ప్ర) మరైతే పేర్లముందు పిలకలూ, పేర్ల చివర తోకలూ తగిలించుకున్నవారే నాయకత్వ స్థానంలో వుండి ఊరేగడం ఎంతవరకు సమంజసం?

జ) కొంతమంది రెడ్లు ఇలా ఉన్నమాట నిజమే. కాని వాళ్ళు కూడా వాళ్ల పరిమితుల్లో బౌద్ధదమ్మవ్యాప్తికి పాటుపడుతున్నారే కాని ఊరేగడం లేదు.

ప్ర) బౌద్ధసంఘాల్లో అంతర్లీనంగా పురుషాధిపత్యమే అమలౌతోందనీ, అందుకే స్త్రీల సంఖ్య బాగా తక్కువనే వాదనపై మీరేమంటారు?

జ) కళ్ళముందు కనిపించే నిజాన్ని కాదన్లేం కదా. ఈ విషయంలో మేం మారాలి.

ప్ర) వేదికలనెక్కి గొప్ప గొప్ప మాటలు దంచే నాయకులంతా సొంతింటి దగ్గర కొచ్చేటప్పటికి మట్టుకు ఆడవాళ్ళని వంటింటి కుందేళ్ళగానే చూడ్డం వలనే బౌద్ధోద్యమం కుంటుపడిందనుకోవచ్చా?

జ) నిజమే, ఈ అంశంలో మార్చుకోవాల్సినవి చాలానే ఉన్నాయి.

ప్ర) ఈ దేశంలో బౌద్ధం ఎలా పతనమైంది?

జ) చాలా పెద్ద ప్రశ్న. మొత్తంగా అణిచేయబడలేదు గానీ వైదిక మతం నాటకాలకి మోసపోయింది. శంకరాచార్యుడు బౌద్ధుల్ని భౌతికంగా నిర్మూలిస్తే, స్వామీ వివేకానంద, రామకృష్ణ పరమహంస నైతిక విషయాల్లో కాపీకొట్టి హిందూమతాన్ని ముందుపెట్టి ప్రచారం చేసారు.

ప్ర) చివరిగా ఇప్పటికీ బౌద్ధమెందుకు అవసరమో చెప్పండి?

జ) ఇదే ప్రశ్నకి "బౌద్ధం ఇప్పటికీ అవశరమా?" అంటూ 300 పేజీల పుస్తకం రాసా. రాహుల్ బౌద్ధదర్శనాన్ని ఆలూరి భుజంగరావుగారిచేత అనువదింపజేయాలని తీవ్రంగా ప్రయత్నించి ఆయన్ని బ్రతిమాలి ఆఖరికి ఆయనస్తమించిన తర్వాత చాలా కష్టపడి హిందీ నేర్చుకుని మరీ దాన్ని తెలుగు చేసాను. అలాగే ధర్మానంద కోశాంబి 'భగవాన్ బుద్ధ'ని తెలుగు చేసా. వినయపిటకాన్ని ప్రజావుద్యమ కార్యకర్తల కోసం విశ్లేషించాను. నేనో 6 సం॥రాలు వేదాల్తో మొదలెట్టి ఉపనిషత్తులు, షడ్దర్శనాలు మొదలైన సాహిత్యాన్నంతా క్షుణ్ణంగా చదివాను. కాబట్టీ, నా దగ్గర సంప్రదాయ పండితుల పప్పులుడకవు. మార్క్సిజానిది వర్గ దృక్పథం, కుల దృక్పథం గల ఈ దేశానికి అంబేద్కర్ తోవ చూపిన బౌద్ధమే శరణ్యం. అలాగే గాంధీని అనవసరంగా ద్వేషించడం సరికాదు. అంబేద్కర్‌కు బౌద్ధం తీసుకోవాలనే ఆలోచన రాకముందే గాంధీ అనేక బుద్ధజయంతులు జరిపాడు. అంతేకాదు, చివరిదాకా ఎన్ని రాజకీయ విధానాలున్నా అహింస నుండి తప్పుకోలేదు. కావున అంబేద్కరిస్టులు గాంధీని అర్థం చేసుకుందుకు ప్రయత్నించాలి. మానవీయ విలువల్లేకుండా ఏ మానవ సమాజమూ మనలేదు. జంతు ప్రపంచానికీ - మానవ ప్రపంచానికీ అదే తేడా. ఆ విలువల్ని బోధించే బౌద్ధం ఏనాటికైనా అవసరమే. అలాటి బౌద్ధధమ్మ ప్రచారమే నా లక్ష్యం.





## బౌద్ధ సారస్వత అధ్యయనశీలి

# అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి (బుద్ధఘోషుడు)గారితో ఇంటర్వ్యూ

**ప్ర) మీ భావపరిణామక్రమం గురించి చెప్పండి?**

జ) నేను తెనాలి తాలూకా తూములూరులో 1933, ఫిబ్రవరి 22న పుట్టాను. గుంటూరు, వైజాగుల్లో చదివాను. విద్యార్థి దశలోనే ఆచార్య సచ్చిదానందమూర్తిగారి శిష్యుడ్ని. నాస్తిక, హేతువాద, వామపక్ష చైతన్యం అప్పట్నుంచే వుండేది. త్రిపురనేని రామస్వామిగారి స్ఫూర్తితో ప్రతిదాన్ని ప్రశ్నించడం అలవాటైంది. విద్యానంతరం తెనాలిలో లెక్చరర్‌గా 17 సం॥రాలు పన్చేసా. ఆ క్రమంలో 'థిచ్ నాథ్ హెంచ్' (Thich Nhath Hanch) అనే వియత్నాం బౌద్ధబిక్కువొకాయన బౌద్ధాన్ని సామాజిక సమస్యలకు అన్వయిస్తూ సంస్కరణోద్యమాలకు స్వీకారం చుట్టాడు. అది నచ్చని వియత్నాం ప్రభుత్వం ఆయన్ని దేశం నుంచి బహిష్కరించింది. అప్పుడాయన ఫ్రాన్స్ వెళ్ళి ఆదర్శ బౌద్ధగ్రామాన్ని నిర్మించాడు. 1997లో చెన్నైలోని థియోసాఫికల్ సొసైటీకి వచ్చి శిక్షణా తరగతులు నిర్వహించాడు. హిందూ పత్రిక ద్వారా అది తెల్సుకున్న నేనూ వాటిల్లో పాల్గొనడం ద్వారా బౌద్ధాభిమానినయ్యాను.

**ప్ర) అంటే అంతకుముందు మీపై మరెవరి ప్రభావమూ లేదా?**

జ) ప్రఖ్యాత బౌద్ధ పండితుడూ, సాహితీవేత్తా 'కీలుబొమ్మలు' నవలా రచయిత, ఆచార్య నాగార్జునుడి బౌద్ధ రచనలు మొదలుకుని, సుప్రసిద్ధ తత్వవేత్త ప్లేటో రచనల వరకూ తెలుగువారికి అందించిన జి.వి. కృష్ణారావుగారు నా కొలీగ్. మేమిద్దరం మంచి మిత్రులుగా వుండేవాళ్ళం. మా భావాలు దాదాపు ఒక్కటిగానే వుండేవి. ఆయన రాడికల్ హ్యూమనిస్టు. తెలుగునాట మహాకవిగా పేరొందిన శ్రీశ్రీ వ్యక్తిత్వాన్ని గురించీ ఏకంగా ఆంధ్రపత్రికలోనే విశ్లేషించి ఆయన్ని అసలు కవే కాదు పొమ్మన్న ధైర్యశాలి కృష్ణారావు. అలాగే

హితశ్రీ, కొండూరు వీరరాఘవాచార్యులు, జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి, థిచ్‌నాథ్ హేన్, ఆలపాటి రవీంద్రనాథ్, ఆంజనేయరెడ్డి మొదలైన మిత్రుల ప్రభావం నాపై ఉండేది.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం చీలికలకు కారణాలేంటి?**

జ) బౌద్ధంలోని అనాత్మవాదాన్ని అర్థంచేసుకోలేక స్వార్థాన్నీ, అహంకారాన్నీ వీడలేకపోవడమే నా దృష్టిలో చీలికలకు ప్రధాన కారణం. ఆకర్షణలపై ఆశ నొదులుకున్నాడు కనుకనే సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు, మనం బద్ధులమయ్యాం.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో ఈనాటికీ అగ్రకులాధిపత్యమే చలామణీ అవుతోందనే వాదనపై మీ స్పందన ఏమిటి?**

జ) నాకు తెలిసీ అలాందిదేమీ లేదు, తెలీకుండా ఉందేమో తెలీదు.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో రెడ్డి కులాధిపత్యం పెరిగిపోయిందనీ, అందుకే పేర్లముందు పిలకలు, పేర్ల చివర తోకలూ తీయడానికి మనసు రావట్లేదనే విమర్శపై...?**

జ) ఒక సంఘంలో రెడ్ల ఆధిపత్యముంటే అది రెడ్డి సంఘమౌతుందే కాని బౌద్ధ సంఘం కాదు. ప్రముఖ అమెరికన్ బౌద్ధ బిక్షువు 'బిక్కుబోధి' హైద్రాబాద్ వచ్చినప్పుడు ఆంజనేయరెడ్డిగారు సభలో వరుసగా నలుగురైదుగుర్ని రెడ్డి తగిలించి పరిచయం చేయడంతో 'ఆంధ్రలోని బౌద్ధులంతా రెడ్లేనా?' అనడిగారు. నా పేర్లో రెండు రెడ్లున్నాయి. అది పట్టించుకోవాల్సిన విషయం కాపోయినప్పటికీ లౌకికంగా పదాలకే ప్రాముఖ్యమిచ్చి కులాన్నంటగట్టడంతో అహాన్ని చంపుకుని 'బుద్ధఘోషుడి'గా మారాను. ఐనప్పటికీ ఇంటిపేర్లో రెడ్డుందంటున్నారు. వాస్తవమేంటంటే రాష్ట్ర వ్యాప్తంగా నలుగురైదుగురమే రెడ్లమున్నాం, ఎవరి పరిమితుల్లో వాళ్ళం బౌద్ధధమ్మవ్యాప్తికి కృషిచేస్తున్న క్రమంలో యాదృచ్ఛికంగా ఎవరికైనా అలా అనిపించొచ్చు కానీ అది నిజం కాదు.

**ప్ర) మీ రచనా వ్యాసంగం గురించి చెప్పండి?**

జ) ఇప్పటికి 70కి పైగా రచనలొచ్చాయి. అందులో 22 బౌద్ధ రచనలు. 1988లోనే విజయవాడ పల్లవి పబ్లికేషన్స్ అధినేత వెంకటరమణగారి కోరిక

మేరకు 'మానవీయ బుద్ధ' అనే గ్రంథాన్ని రాసా. అదెంత ప్రాచుర్యం పొందిందంటే కన్నడలోకి కూడా అనువదించడం జరుగుతోంది. అలాగే 97లో నారద మహాథేరా రాసిన Buddha and His Teachingsను బౌద్ధదర్శనం పేర్తో తెలుగుచేసా. అది తెలుగు యూనివర్సిటీవారి బహుమతిని పొందడమే గాక దాన్ని ఆధారం చేస్కుని కె. శివానందమూర్తి గారు బుద్ధుడనే సినిమా కూడా తీసారు. 64లోనే ఆండ్రేడ్ రాసిన Physics for the modern World ను, 'ఆధునిక ప్రపంచానికి భౌతిక విజ్ఞానం' పేరిట అనువదించా. అలాగే సిగ్మండ్ ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని క్రోడీకరించి తెలుగులో మొట్టమొదట గ్రంథంగా తీసుకొచ్చింది నేనే. తెలుగు అకాడెమీ ప్రచురించిన ఆ రచన ఇప్పటికి 10 సార్లు ముద్రితమైంది. అలాగే మార్క్స్, హెగెల్, ఫ్రాయిడ్, ప్లేటో, అరిస్టాటిల్ మొదలైన తాత్వికుల దార్శనికతను గూర్చి రేడియోలో 10 సం॥రాలు ప్రసంగాలు చేసా. ఎరిక్‌ఫ్రామ్ మార్క్స్ కాన్సెప్ట్ ఆఫ్ మేన్‌నూ, ఆర్ట్ ఆఫ్ లివింగ్‌ను తెలుగులో మొదటగా రచించింది నేనే. అలాగే తెలుగులో ప్రప్రథమంగా మహాబౌద్ధ విజ్ఞాన సర్వస్వ నిఘంటువుని 4 సం॥రాలు నిరవధిక శ్రమతో వెలువరించడం జరిగింది. మేధోబృందాలకే సాధ్యమైన పనిని ఒక్కడినే నిర్వహించా. ఆచార్య నాగార్జునుడి మూలమాధ్యమికకారిక మొదలుకుని అమూల్య బౌద్ధ గ్రంథాలైన దీర్ఘనికాయ, మధ్యమనికాయ, సంయుక్త నికాయ, సుత్తనిపాత ఇంకా అనేక గ్రంథాల్ని తెలుగుచేసా. పాల్‌కేరస్ రాసిన The Gospel of Buddhaని 'బుద్ధుని ధర్మోపదేశం' పేర అనువదించా. మనోవిజ్ఞానశాస్త్ర విద్యార్థినవడంచేత స్వప్నాలను విశ్లేషిస్తూ స్వప్న సందేశం, మనసు-మర్మం ప్రపంచంలోని ముఖ్య మతాల్ని విశ్లేషిస్తూ, ప్రపంచ మతాలు మొదలైన రచనలెన్నో చేసాను. ప్రస్తుతం మిళింద-నాగసేన సంవాదాన్ని అనువాదం చేస్తున్నాను.

ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా పురుషాధిపత్యమే చలామణీ అవుతోందనీ, స్త్రీలపై అప్రకటిత అణచివేత కొనసాగుతోందంటే దానికి మీరేమంటారు?

జ) స్త్రీలు తక్కువగా ఉన్నమాట నిజమే. మతస్వేచ్ఛ వుంటే స్త్రీలు బౌద్ధానికే ప్రాముఖ్యత నిస్తారనడంలో సందేహం లేదు.

**ప్ర) సభల్లోనూ, రచనల్లోనూ పెద్ద పెద్ద కబుర్లు చెప్పేవారు వ్యక్తిగత, కుటుంబాల దగ్గరకొచ్చేటప్పటికి సంకుచితంగా ప్రవర్తించడం వల్లే ఉద్యమం నష్టపోతోందంటే మీరేమంటారు?**

జ) బుద్ధిపరంగా బౌద్ధులైనవారు కూడా ఆచరణలో సంకతస్థితి (Conditioned State of mind)కి బద్ధులవుతుండటం కద్దు. All the time till now I tried to become somebody; But now after the buddha I try to become nobody. ఐనా ఇప్పటికీ నేనింకా పూర్తిగా మారలేదు, విజయం సాధించలేదు.

**ప్ర) చివరిగా, బౌద్ధం ఈనాడెందుకు అవసరమో చెప్పండి?**

జ) ఎథీజం, రేషనలిజం, ఎంపెరికిసిజం, హ్యూమనిజం కలగల్సిన ధమ్మమే బౌద్ధం. అదే కాలంలోనైనా సమాజానికి అవసరమే. మానవ అస్తిత్వంలోనే అంతర్గతంగా అనిశ్చిత స్థితి ఉంది. దాన్నుంని నిశ్చితస్థితికి చేర్చే మార్గం కోసం, విలువలపై ఆధారపడే ధర్మం కోసం ఏ కాలంలోనైనా తాత్వికాన్వేషణ జరుగుతూనే ఉంటుంది. అలాంటి మార్గం "బహుజన హితాయ, బహుజన సుఖాయ, లోకానుకంపాయ" అనే తాత్వికతను కలిగుండాలి. అదే సార్వత్రిక - సార్వజనీక ధమ్మమౌతుంది. బౌద్ధం సరిగ్గా అలాంటి ధమ్మం. అందుకే బౌద్ధం ఏనాడైనా అవసరం.





### ధమ్మప్రభ పత్రిక స్థాపకులు

## ఉపాసక సరెళ్ళ వెంకటరత్నం (సవేర) గారితో

### ఇంటర్వ్యూ

(ప్ర) మీ జీవన ప్రస్థానంలో ప్రథమ దశను గురించి చెప్పగలరా?

జ) నేను తూ.గో.జిల్లాలోని అల్లవరం మండలం తుమ్మలపల్లి గ్రామంలో బీద దళిత కుటుంబంలో పుట్టాను. అప్పట్లోనే బండారులంక దగ్గర గంగలకుర్రు వద్ద సాముగారడీలు నేర్చుకున్నా. మా నాన్న పాలేరుగా ఉండేవాడు. తన పిల్లలలాకావడమిష్టంలేక వాళ్ళని బాగా చదివించి ఉన్నతస్థితికి చేర్చాలని కష్టపడి మమ్మల్ని చదివించాడు. అలా సెలవురోజుల్లో నేను కూడా కూలిపన్చేస్తూ కష్టపడి ఎస్సెస్సెల్సీ మంచి మార్కుల్తో స్కూల్ ఫస్టొచ్చాను. కాలికి చెప్పులు కూడా లేని కుర్రాడు అంత ప్రతిభ కనబర్చడం అగ్రవర్ణ అయ్యోర్లకి మింగుడుపడక లోలోపలే కుళ్ళుకుని చచ్చేవారు.

(ప్ర) అప్పటికీ అంటరానితనం అమలయ్యేనా?

జ) అవును. తరగతి గదిలో బాగా చదివితే అసూయపడేవారు, చదవకపోతే తిట్టేవారు. అగ్రహారపు వీధుల్లో నడిచే హక్కు కూడా మాకుండేది కాదు. బ్రాహ్మణాధిపత్యం కోరలుచాపి విరుచుకుపడేది. అలాగని వారంతా చెడ్డవారు కాదు, ఎంతోమంది మంచివాళ్ళున్నారు. దేహశుద్ధి, వాక్శుద్ధి, మనఃశుద్ధీ వారి నుంచే నేను నేర్చుకున్నాను.

(ప్ర) బౌద్ధునిగా ఎలా మారారు?

జ) అంబేద్కర్ చనిపోయినప్పుడు మా గ్రామంలో సంతాపసభ జరిగింది. అప్పుడు దళిత నాయకుల కన్నీళ్ళను గుర్తుచేసుకుంటే నాకిప్పటికీ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. అప్పుడే అంబేద్కర్‌ను అధ్యయనం చేయడం మొదలెట్టి ఆయన చూపిన మార్గంలో బౌద్ధునిగా మారాను.

(ప్ర) అప్పటి మీ అనుభవాలేమైనా చెప్పగలరా?

జ) బి.వి. రమణయ్యగారి అనుచరుడిగా ఆర్.ఎస్.ఎఫ్. (రిపబ్లికన్ స్టూడెంట్స్ ఫెడరేషన్), ఆర్.పి.ఐ. (రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా)ల్లో చురుకుగా

పనిచేసా. అనేక గ్రామాల్లో రాత్రిబళ్ళు నడిపి అంబేద్కర్ జీవితాన్ని వివిధ కోణాల్లో వివరించి చెప్పేవాళ్ళం. వణికించే చలి రాత్రుల వేళల్లో చీకటిని తరిమేజ్ఞానాన్ని గ్రామీణులకు పంచుతూ వారి లాంతర్ల మాటున నులకమంచాల మీద కూర్చొని నాటుకూర మాంసంతో చారు కలుపుకుతిన్న సందర్భాలు నా మదిలో ఎప్పటికీ సజీవంగానే ఉంటాయి. 1965లోనే 'అంబేద్కర్ స్టడీ సెంటర్' పెట్టాను. డి.ఇడి చేసి 30 సం॥రాలు ఉద్యోగం చేసి రిటైరయ్యాక మొత్తం బౌద్ధధమ్మ ప్రచారానికే అంకితమయ్యాను.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో సైతం మతాతత్వం, అగ్రకులాధిపత్యం రాజ్యమేలుతున్నాయనే విమర్శపై మీ అభిప్రాయం?**

జ) అగ్రకులాలనారు బౌద్ధసంఘాల్లో చేరి వాట్ని నిర్వీర్యం చేసే కుట్ర పూర్వం నుంచీ నడుస్తోంది. బ్రాహ్మణాధిపత్యమే మతాలకు మూల కారణం.

ప్ర) **అంబేద్కర్‌ది నిజమైన బౌద్ధం కాదనే వాదన కొద్దిమంది చేస్తున్నారు, దానిపై...?**

జ) నాగార్జునుడి బౌద్ధాన్నీ, బ్రాహ్మణ బౌద్ధాన్నీ మాత్రమే యిష్టపడే అగ్రవర్ణాల వారు ఇప్పటికీ బౌద్ధసంఘాలపై పెత్తనాన్ని వదులుకోలేక లక్షలాది దళిత బహుజనుల విముక్తికి తోడ్పడే బౌద్ధాన్ని బలపర్చలేక ఇలాంటి క్షుద్రప్రచారాలకు దిగజారుతున్నారు. హంగేరీ లాంటి దేశాల్లో సైతం పీడిత ప్రజల ఆపద్బాంధవునిగా అంబేద్కర్‌ను గౌరవిస్తుంటే మన అగ్రకుల దుండగులు మాత్రం ఇప్పటికీ బుద్ధిలేకుండానే వ్యవహరిస్తున్నారు.

ప్ర) **మీ కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ) అనేక కార్యక్రమాలున్నాయి. 'దళిత చైతన్య వేదిక' స్థాపించి వందలాది మంది విద్యార్థులకు సాయమందించా. అలాగే నిరుపేద దళిత విద్యార్థినీ విద్యార్థుల్ని ప్రోత్సహించడం కోసం 'అంబేద్కర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్', 'సవేరా ఛారిటబుల్ ట్రస్ట్' స్థాపించి ఎంతోమందికి సహకరిస్తున్నా. అంబేద్కర్ దృక్పథంతో తెలుగులో మొట్టమొదటి బౌద్ధధమ్మ ప్రచార పత్రిక 'ధమ్మప్రభ'ను స్థాపించీ 3 సం॥రాలు నడిపాను. ఎంతోమంది దేశవిదేశ ప్రముఖ బౌద్ధుల ఇంటర్వ్యూలు మొదలుకుని ఎన్నో అరుదైన బౌద్ధ దార్శనిక రచనలను దానిద్వారా అందించాను. 74లో మొదటి రచనను ప్రచురించిన నేను యిప్పటికి 35 రచనల్చేసాను. దళిత బహుజన రచయితల్లో బోయిభీమన్నగారి తర్వాత అన్ని ప్రక్రియల్లో రాసిన వారితో బహుశా నేనూ

ఒకడ్ని. అంబేద్కర్ జీవిత చరిత్రను తెలుగు వారికి అందించి, ప్రజాబంధు, ఆంధ్రా రిపబ్లికన్, పీపుల్స్ హెరాల్డ్ పత్రికలు నడిపీ జీవితాన్ని అంబేద్కరిజం కోసమే అర్పించిన ఎండ్లూరి చిన్నయ్య గారి జీవితచరిత్రనూ, ప్రముఖ రచయితా, బౌద్ధులు పి. అబ్బాయి జీవిత చరిత్రనూ తెలుగువారి కందించాను. హరిజన్ పదాన్ని నిషేధించమని నేరాసిన పొత్తాన్ని 5000 ముద్రించడం మొదలుకుని 'జైభీమ్' ప్రాముఖ్యతనూ, ముల్క్‌రాజ్ ఆనంద్ - అంబేద్కర్‌కు జరిగిన చర్చనూ తెలుగు చేసేంతవరకూ ఎంతో ఉద్యమ సాహిత్యాన్ని వెలువరించా. అలాగే అంబేద్కర్ జీవిత చరిత్రను సంక్షిప్తీకరించీ నేరాసిన పొత్తం ఇప్పటికి 86,000 మందికి చేరింది. ఈ కృషి వల్లే అంబేద్కర్ ఇంటర్‌నేషనల్ మిషన్ లిటరరీ అవార్డు నాకొచ్చింది.

**ప్ర) బౌద్ధ సంఘాలు, అంబేద్కర్ ఆలోచనా వేదికల్లో కూడా పురుషాధిపత్యమే చలామణీ అవుతోందనే వాదనపై మీరేమంటారు?**

జ) నిజమే. మగాళ్ళతో సమానంగా స్త్రీలు బయటకు రాలేకపోవడమో కారణమైతే, బౌద్ధావగాహన లేకపోవడమో ప్రధాన కారణం.

**ప్ర) వేదికలపైనా, పుస్తకాల్లోనూ గొప్పగా కనిపించే వారంతా వ్యక్తిగత, కుటుంబ వ్యవహారాల్లో సంకుచితులుగా వుండడమే దీనికి కారణం, కాదంటారా?**

జ) అయ్యుండొచ్చు, ఏదేమైనా ఈ విషయాలపై సంఘాలు దృష్టి పెట్టాలి.

**ప్ర) ఈ దేశంలో బౌద్ధమెలా అంతరించింది?**

జ) అంతరించలేదు, క్రూరంగా అణిచివేయబడింది, ఘోరంగా కాలరాయ బడింది.

**ప్ర) చివరిగా, బౌద్ధం ఈనాటికీ ఎందుకవసరమో చెప్పి ముగించండి?**

జ) అనేక జాతీయ అంతర్జాతీయ సభలకు వక్తగా వెళ్ళినప్పుడు నేనొక్కటే అడుగుతాను. బాబాసాహెబ్ కనుక లేకపోయుంటే ఇన్ని కోట్లమంది పీడితుల జీవితాల గతేమిటని. ఆయన్ని ఒకవైపు ఉపయోగించుకుంటూ మరోవైపు ఇతర మతాల్నీ, మద్యపానాన్నీ, కుటుంబ స్వార్థాన్ని పట్టుకువేలాడే కుత్సిత బుద్ధులు దళిత బహుజనుల్లో పోవాలి. విశ్వవ్యాప్త పీడిత వైతాళికుడైన అంబేద్కర్ చూపిన శాంతియుత, సర్వజన సమానత్వ సహజీవన మార్గమైన బౌద్ధమే ఎన్నటికైనా మనకు శరణ్యమని గ్రహించి ముందుకు నడవాలి.



వినయపిటక అనువాదకులు

# ధమ్మరక్షిత భిక్కు గారితో ఇంటర్వ్యూ

ప్ర) మీ సత్యాన్వేషణా ప్రస్థానం ఎలా ప్రారంభమైంది?

జ) మాది నిజామాబాద్ జిల్లా మోర్తాడు మండలం తిమ్మాపూర్ గ్రామం. మధ్య తరగతి వ్యవసాయ కుటుంబంలో పుట్టి, డిగ్రీ వరకు చదివాను. పదో తరగతి పరీక్షలు వ్రాసి, వేసవి సెలవుల్లో గ్రామంలో గ్రంథాలయం ఏర్పాటు చేయటానికి ప్రయత్నిస్తున్నపుడు స్వామి వివేకానంద జీవితచరిత్రను చదివాను. ఆ ప్రభావంతో ఆధ్యాత్మికజీవితం వైపు ఆసక్తి కలిగింది. ఆ క్రమంలో గురువును వెతుక్కొని ధ్యానయోగంలో ప్రవేశించి అనేక అనుభవాలను పొందాను.

ప్ర) బౌద్ధభిక్షువుగా ఎలా మారారు?

జ) 1973లోనే ధ్యానంలో చాలా లోతుల్లోకి వెళ్లినపుడు నాలో అంతిమంగా బౌద్ధసంస్కారం ఉన్నట్లు గర్తించాను. మొదటి సంస్కారాలైన కృష్ణభక్తి, అద్వైతాలను దాటుకొని చివరగా ఉన్న బౌద్ధసంస్కారాన్ని చేరుకోవటానికే నా జీవితమంతా ప్రయత్నించాను. మొదట మా గురువుగారి ద్వారానే 1978లో సన్యాసాన్ని స్వీకరించాను. ఆ తర్వాత పరివ్రాజకునిగా హిమాలయాల్లో కొన్నాళ్లు సంచరించాను. 1980లో రాహుల్ సాంకృత్యాయన్ బుద్ధచర్యకు తెలుగు అనువాదం నా కంటపడింది. దానిని చదివిన తర్వాత బుద్ధుని బోధ ఎంత విశిష్టమైనదో నాకు బోధపడింది. కాని నా సాధన బౌద్ధంలోనికి పరిణమించిన తర్వాత మొన్ననే 2015 జులై 30 వ తేదీన బెంగుళూరులోని మహబోధి సొసయిటీలో భిక్షుదీక్ష తీసుకున్నాను.

ప్ర) మీ అనువాదాల గురించి చెపుతారా?

జ) 1983లోనే ధమ్మపదాన్ని తెలుగులోనికి అనువదించాను. 2008 దాని పునర్ముద్రణ జరిగినపుడు నేను వినయ పిటకాన్ని అనువదించిన విషయం

శ్రీబెవర వీరభద్రరావుగారికి తెలిసింది. ఆయన ప్రోత్సాహంతో, ఆయనా ఇంకా ఇతరులూ అందించిన సహకారంతో వినయపిటకాన్ని ప్రచురించాను. అలాగే పతంజలి యోగదర్శనాన్ని, ఖలీల్‌జిబ్రాన్ ది వాయిస్ ఆఫ్ ది మాస్టర్‌ను, అశోకావదానాన్ని, చైనాయాత్రికుడు ఫాహియాన్ భారతదేశ యాత్రను తెలుగులోకి అనువదించాను. అంతర్వీక్షణ పేరుతో కవితలను వెలువరించాను. అన్నింటిలోకి ముఖ్యమైనది ప్రఖ్యాత బౌద్ధ అట్ఠకథాకారుడు ఆచార్యబుద్ధఘోషుని విశుద్ధిమగ్గ అనువాదం. దీనిని తెలుగు త్రిపిటక ప్రణాళికలో భాగంగా మహాబోధి సొసయిటీ వారు ముద్రించారు. ప్రస్తుతం తెలుగు త్రిపిటక ప్రాజెక్టులో నా వంతు సహకారాన్ని అందిస్తున్నాను.

ప్ర) బౌద్ధసంఘాల్లో సైతం కులం ముఖ్యమైపోయిందని, పేర్లకు ముందు పిలకలూ, పేర్ల తర్వాత తోకలూ ఉన్నవారే బౌద్ధులుగా చెలామణి అవుతున్నారనే వాదనపై మీ స్పందన ఏమిటి?

జ) బౌద్ధంలో కులానికి స్థానం లేదు. బౌద్ధుల్ని కులం కళ్లతో చూడకూడదు. చిన్నప్పుడు తలిదండ్రులు పెట్టిన పేరుతోనే జీవితంలో అధికభాగాన్ని గడిపిన వారు బౌద్ధంలోకి మారినతర్వాత పేరుమార్చుకోనంత మాత్రాన కలిగే నష్టం ఏమీ లేదు. కులగోత్రాలు పేరులో రావటం బుద్ధుని కాలంలో కూడా ఉంది. ఉదాహరణకి మౌద్గల్యాయనుడు అంటే ముద్గల గోత్రీకుడు అని కదా అర్థం. అలాగే మహానామశాక్యుడు అన్నపేరులో కులం లేదా! అయితే ఈ కాలంలో పేరుతో కులాన్ని జోడించటం అవసరం అని నేను అనుకోవటం లేదు.

ప్ర) అంబేద్కర్ స్ఫూర్తితో బౌద్ధాన్ని తీసుకుంటున్నవారిపై మీ అభిప్రాయం?

జ) అది మంచిదే. అయితే అంబేద్కర్ తన 'బుద్ధ అండ్ హిజ్ ధమ్మ' లో బౌద్ధాన్ని వ్యాఖ్యానించిన కోణం నుండి చూస్తే బౌద్ధానికి, భౌతికవాదానికి పెద్దగా తేడా కనిపించదు. కర్మకు ఫలం ఉంటుందని, ఆ కర్మఫలం అనుభవింపబడకుండా మిగిలిపోయినపుడు దానిని అనుభవించటానికి పునర్భవం ఉంటుందనే విషయంలో అంబేద్కర్‌కు ముందున్న అన్ని బౌద్ధశాఖలూ ఏకాభిప్రాయంతో ఉన్నాయి. తాము థేరవాద బౌద్ధాన్ని అనుసరిస్తున్నామని అంబేద్కరీయ బౌద్ధులు చెపుతుంటారు. కాని థేరవాదాన్ని అనుసరించే శ్రీలంక, బర్మా మొదలైన దేశాల్లోని బౌద్ధులు

కర్మను, అంత్యకాలంలోని మానసిక స్థితిని బట్టి, పునర్భవాన్ని, స్వర్గ నరకాలను అంగీకరిస్తారు. బుద్ధుడు ఆత్మను అంగీకరించలేదు కాని విజ్ఞానం (= మనస్సు) మరుజన్మకు పోతుందని అనుమానానికి తావులేకుండా చెప్పాడు.

**ప్ర) బౌద్ధసంఘాల్లో పైకి పెద్దమనుషులుగా చెలామణి అవుతూ, వ్యక్తిగత జీవితంలో దురాశని, స్వార్థాన్ని విడనాడనివారివల్లే బౌద్ధ ఉద్యమం కుదేలు పడిందంటే మీరేమంటారు?**

జ) బౌద్ధసంఘాల్లోని పెద్దల వ్యక్తిగత జీవితాల గురించి నాకు తెలియదు. అయితే నాయకత్వం వహించేవారి వ్యక్తిత్వమే వారు నడిపిస్తున్న ఉద్యమాలను ప్రభావితం చేస్తుందనటంలో సందేహం లేదు.

**ప్ర) బౌద్ధసంఘాల్లో పురుషాధిపత్యమే చెలామణి అవుతుందనటం పై మీ స్పందన?**

జ) నేను ఏకాంతజీవిని. సంఘాల్లో ఏం జరుగుతుందనేదాని మీద నాకు అవగాహన లేదు.

**ప్ర) సమాజంలోని ఇతరస్త్రీలు సంఘంలోకి రావటంలేదని వాగ్రే పెద్దల ఆచరణ వారి కుటుంబాల దగ్గరికి వచ్చేసరికి కుదేలు పడుతుందా?**

జ) ఇతరుల కుటుంబాల గురించిన విషయాలు నాకు తెలియవు.

**ప్ర) ఈ దేశంలో బౌద్ధం అదృశ్యం కావటానికి కారణాలేవి?**

జ) బయటినుండి అణచివేత. అంతర్గతలోపాలు అందుకు కారణం.

**ప్ర) బౌద్ధం ఇప్పటికీ అవసరమా?**

జ) భౌతికసుఖాలే సర్వస్వమని భావించి, నైతికసూత్రాలను గాలికి వదిలివేసిన ఇప్పటి కాలానికి బౌద్ధం అవసరం చాలా ఉంది. బౌద్ధానికి పునాది శీలం. పంచశీల, చిత్తానికి ఏకాగ్రతను కూర్చి ప్రశాంతతను ఇచ్చే ధ్యానం, ఆ ధ్యానం వలన కలిగే ప్రజ్ఞ అన్ని కాలాలకూ అవసరమే.

**ప్ర) మీ జీవితలక్ష్యం ఏమిటి?**

జ) బుద్ధుడు చెప్పిన విధంగా ధమ్మాన్ని సాక్షాత్కరించుకొని, ప్రచారం చేయటమే.



బుద్ధిస్ట్ సొసైటీ ఇండియా నేత

# చింతా శ్రీరామ్మూర్తిగారితో

ఇంటర్వ్యూ

**ప్ర) బౌద్ధుడిలా ఎలా మారారో చెప్పండి?**

జ) మాది అమలాపురం దగ్గర ఇందుపల్లి, ఇంటర్‌దాకా అక్కడే చదివి కాకినాడలో ఇంజనీరింగ్ చేసి అనేక ప్రాంతాల్లో ఉద్యోగం చేసి హైద్రాబాద్‌లో స్థిరపడ్డాను. అంటరానితనం ఘోరంగా అమలయ్యే ఆ రోజుల్లో అగ్రహారాల్లో నడిచేందుకు కూడా అనుమతి మాకుండేది కాదు. అలాంటి వాతావరణంలో స్వచ్ఛందంగానే చైతన్యవంతుడినై బాబాసాహెబ్ సాహిత్యాన్ని అధ్యయనం చేసి 1970లోనే భార్య విజయకుమారితో కల్సి బౌద్ధం స్వీకరించాను.

**ప్ర) మీ కార్యక్రమాల వివరాలు చెప్పగలరా?**

జ) కోస్తా రాయలసీమలోని వివిధ ప్రాంతాల్లో ఉద్యోగం చేయాల్సి రాడంతో క్షేత్రస్థాయిలో ఉద్యమంలో పాలుపంచుకునే అవకాశం నాకు రాలేదు. ఐతే భావజాలోద్యమంలో మాత్రం విస్తృతంగా పాల్గొన్నాను. బి.ఎస్.ఐ. అధ్యక్షుడిగా చాలాకాలముండి యువతను ప్రోత్సహించే ఉద్దేశంతో స్వచ్ఛందంగానే పదవినుంచి తప్పుకున్నాను. పీపుల్స్ ఎడ్యుకేషనల్ సొసైటీని స్థాపించి అనేక అంబేద్కరీయ, బౌద్ధ దార్శనిక గ్రంథాల్ని ప్రజలకోసం ప్రచురించే కార్యక్రమం చేపట్టాం. అలాగే బౌద్ధోద్యమానికి తోడ్పడతాయనే సాహిత్యాన్ని పునర్ముద్రిస్తున్నాం. భూపతిగారు, కట్టయ్యగారు మొదలైనవారి సహకారంతో ముందుకెళుతున్నాం.

**ప్ర) బౌద్ధసంఘాల్లో కూడా ముఠాలు చీలికలు వున్నాయన్న విమర్శకు మీ స్పందనేంటి?**

జ) హిందూ కళ్ళతో, మనసుతోనున్నంతవరకూ చీలికలు తప్పవు. కొంతమంది స్వార్థపరులు లేకపోలేదు కానీ మొత్తానికి బౌద్ధులంతా ఒక్కటే.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా అగ్రకులాధిపత్యం, రెడ్ల రాజ్యం చలామణి అవుతోందనీ అణగారిన వర్గాలకు ప్రాతినిధ్యం లేదనే వాదనపై మీ భావన?**

జ) ఈ విషయంపై నేనేం వ్యాఖ్యానించలేను. కానీ హైందవ మతం ఎక్కడున్నా అక్కడ కులాలూ, అగ్రవర్ణాధిపత్యం అమలవడం సహజం. ఒక హిందూ ఎంత చదివినా, ఎన్ని సిద్ధాంతాలు చెప్పినా కులాన్ని డిస్‌వోన్ చేసుకోడు.

**ప్ర) అంబేద్కర్ ప్రతిపాదించింది నిజమయిన బౌద్ధం కాదనే వాదనొకటి ఈమధ్య తలెత్తుతోంది. మీరేమంటారు?**

జ) అంబేద్కర్‌ది అచ్చమైన బౌద్ధం. అది బౌద్ధం కాదని బోధించేవారి అభిప్రాయంతో నేను విభేదిస్తున్నాను. అంబేద్కర్ బౌద్ధంతోపాటు విభిన్నమైన ధోరణులెన్నున్నా బౌద్ధధమ్మ సారమంతా ఒక్కటే.

**ప్ర) బౌద్ధసంఘాలు, అంబేద్కర్ సంఘాల్లో సైతం పురుషాధిపత్యం అమలౌతోందనీ స్త్రీల సంఖ్య అందుకే పెరగడం లేదంటే దానికి మీరేమంటారు?**

జ) నిజమే. ఈ లోపం ఉంది. స్త్రీలూ, యువతా ముందుకు రాకపోవడానికి మా అవగాహనాలోపం కూడా కొంత కారణమే.

**ప్ర) ఉద్యమవేదికలపై డాబు కబుర్లు చెప్పే పెద్దమనుషులంతా వ్యక్తిగత జీవితాల్లో సంకుచితంగా ప్రవర్తించడంపై మీరేమంటారు?**

జ) లోతైన అధ్యయనం లేకపోవడమే దీనిక్కారణం.

**ప్ర) భారద్దేశంలో బౌద్ధమెలా పతనమైంది?**

జ) బ్రాహ్మణిజం అణగదొక్కింది. కుట్రలుపన్ని కూలదోసింది.

**ప్ర) ఇక చివరిగా బౌద్ధం ఈరోజెందుకు అవసరమో చెప్పండి?**

జ) మతోన్మాదాన్ని ఎదుర్కునే మానవీయ మతం అదేరోజైనా మనిషికి అవసరమే. అందుకే బౌద్ధం అవసరం ఈరోజు మరింత పెరిగింది. అంబేద్కర్ వల్ల అవకాశాలు పొందినవారు సైతం అది మర్చిపోయి దొంగలుగా తయారై ఆయన్నే నాస్తికుడంటూ, బౌద్ధుడంటూ ద్వేషిస్తూ అగ్రవర్ణాల్ని అనుసరించడానికి సిద్ధపడుతున్నారే కాని వారి జాతిజనుల ఉన్నతికి సహకరించలేకపోతున్నారు. గొప్పగొప్ప చదువులు చదివిన విద్యావంతులకి సైతం ఈరోజు స్వార్థమే పరమావధి అయింది. ఈ పరిస్థితి మారాలి. అణగారిన ప్రజలంతా ఒక్కతాటిపైకొచ్చి వారికి ఆత్మగౌరవంతో, శీలంతో, జ్ఞానంతో జీవించే అవకాశమిచ్చే బౌద్ధధమ్మాన్ని స్వీకరించి అంబేద్కర్ ఆశయసాధనకు అంకితమవ్వాలి.



బౌద్ధధమ్మ ప్రచారకురాలు

# పైడితల్లిగారితో

ఇంటర్వ్యూ

ప్ర) **బౌద్ధంలోకి ఎలా వచ్చారో చెప్పండి?**

జ) మా పూర్వీకులది ఉత్తరాంధ్ర. చిన్నప్పుడు క్రైస్తవ మిషనరీ స్కూల్లో చదివాను. అలాగే ఊళ్ళోని వేణుగోపాలస్వామి గుళ్ళో జరిగే భాగవతపురాణ కాలక్షేపానికి కూడా వెళ్ళేదాన్ని. అలా హైందవ-క్రైస్తవ పవిత్ర గ్రంథాలు కంఠతావచ్చేసాయి. ఆ రోజుల్లో తెలంగాణా సాయుధ పోరాట ప్రభావం చాలా వుండేది. మా ఆయన కె.ఎన్. రావుగారు స్వాతంత్ర్యోద్యమకారులు. చాలాకాలం అజ్ఞాతంలో ఉన్నారు. 1956లో వివాహమయ్యే సమయానికే ఆయనవి అభ్యుదయ భావాలు. నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌గార్ని తీసుకొచ్చి కాకినాడలో సమావేశం ఏర్పాటు చేసినవార్లో ఆయనా ఒకరు. మార్క్సిజాన్ని అర్థం చేసుకోవడం కష్టమని రాహుల్ సాంకృత్యాయన్ రచనలు నాచేత చదివించారు. ఆ రోజుల్లో అమరావతిలో ప్రచురితమయిన ధమ్మపదాన్ని తెప్పించుకుని చదివి ఆంధ్ర బౌద్ధ సమాజంవారితో పరిచయం చేసుకుని బౌద్ధాభిమానిగా మారాను.

ప్ర) **ఇంకా మీపై ఎవరెవరి ప్రభావం ఉంది?**

జ) చిన్నప్పుడు రేడియోలో రావుబాలసరస్వతిగారు సాలూరి రాజేశ్వర్రావుగారి సంగీత సారధ్యంలో “ఆ తోటలోన వొకటి ఆరాధనాలయం...” అనే పాట నా పసిమనస్సుపై చెరగని ముద్ర వేసింది. మా దంపతులది కులాంతర ఆదర్శ వివాహం. పిలలొద్దనుకున్నాం. రోమన్ కేథలిక్ స్కూల్లో టీచరుగా 40 సం॥రాలు పనిచేసి రిటైరయ్యాను. బౌద్ధ సాహిత్యం, ముఖ్యంగా గోయేంకాగారి ప్రభావం నా వ్యక్తిత్వంపై చాలా వుంది.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో సైతం ఐక్యత లేదనీ, ముఠాలు-చీలికలు ఉన్నాయనే వాదనపై మీ అభిప్రాయమేంటి?**

జ) నిజమైన బౌద్ధంలో భావపరంగా విభిన్న శాఖలుండొచ్చు కానీ చీలికలూ పీలికలూ వుండవు. అందరి మనస్తత్వాలు ఒకేలా వుండవు. కాబట్టి కొందర్లో

పెత్తనం చేసే ధోరణీ, పదవీ వ్యామోహం, స్వప్రయోజనాలూ ఇందుక్కారణం.

ప్ర) **మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?**

జ) బౌద్ధధమ్మప్రచారమే నా కార్యక్రమం. అప్పట్లోనే కాకినాడ నుంచొచ్చే సర్కార్ ఎక్స్‌ప్రెస్, స్పందన తదితర పత్రికలకి బౌద్ధ అనువాద రచనల్ని పంపేదాన్ని. అలాగే అనేక స్కూళ్ళకెళ్ళి బౌద్ధంపై ప్రచారం చేస్తుంటాను. అట్టతో అశోక చక్రాన్ని చేసి దాని చరిత్రను విద్యార్థులకు విడమర్చి చెబుతుంటాను. అలాగే ధర్మచక్రం బొమ్మల్ని చూపించి వివరిస్తుంటాను.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో పురుషాధిక్యత వుందనీ స్త్రీల సంఖ్య అందుకే తక్కువగా వుందనే వాదనపై మీ భావన?**

జ) నేను చూసినంతలో స్త్రీ స్వాతంత్ర్యం వుంది. అణిచివేసే ధోరణి లేదు.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో సైతం అగ్రకులాధిపత్యం వుందనే వాదనపై మీరేమంటారు?**

జ) నాకా విషయం తెలీదు.

ప్ర) **ఈ దేశంలో బౌద్ధం ఎలా అంతరించింది?**

జ) పుష్యమిత్ర శృంగుడు, శంకరాచార్యుడు బౌద్ధాన్ని నాశనం చేయడానికి కృషి చేసారు. అందుకే బలవంతంగా తరిమివేయబడింది. గురజాడ అప్పారావుగారు, కందుకూరి వీరేశలింగం గారు మొదలైనవారి అభిప్రాయం ప్రకారం కూడా బౌద్ధం అణిచివేయబడింది.

ప్ర) **ఈనాటికీ బౌద్ధం ఎందుకవసరమో చెప్పండి?**

జ) మద్యం, మత్తు పదార్థాల ఆకర్షణలు పెరిగిన సమాజంలో నైతికత అవసరం పెరుగుతుందేకాని తరగదు. అందుకే ఈరోజు బౌద్ధం అవసరం మరింతగా పెరిగింది. 2001లో బిక్కూ సంఘ రక్షిత మహాథేరాగారి సమక్షంలో నేను ధమ్మదీక్ష తీసుకున్నాను. అప్పట్నుంచీ విపశ్యనా, అశోకచక్ర తదితర బౌద్ధాంశాల్ని ప్రచారం చేస్తున్నాను. బౌద్ధధమ్మ పాఠశాలలు రావాలి. బాల్యం నుంచే పిల్లలకు నైతికపరమైన విద్యను బోధించడం వల్ల పటిష్ఠమయిన వ్యక్తిత్వం ఏర్పడుతుంది. బౌద్ధ పత్రికల్లో వివిధ వ్యాసాలు, రచనలు చేస్తుంటాను. సభలూ, సమావేశాల్ని ఏర్పాటు చేస్తుంటాను. నూతన తరం దూతలకి బౌద్ధధమ్మాన్ని పరిచయం చేయాలనేదే నా ఆశయం.



బౌద్ధ పరిషత్ స్థాపకులు

# గొంది నవీన్‌గారితో

ఇంటర్వ్యూ

ప్ర) **బౌద్ధుడిగా ఎలా మారారో చెప్పండి?**

జ) చిన్నప్పట్నుంచీ బుద్ధుడంటే అభిమానం, భక్తీ వుండేది. అంబేద్కర్‌ను అధ్యయనం చేసింతర్వాత 1982లో పావనమూర్తిగారాధ్వర్యంలో బౌద్ధం తీసుకుని బౌద్ధుడ్నయ్యాను.

ప్ర) **మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?**

జ) బి.హెచ్.పి.వి.లో 38 సం॥రాలు ఉద్యోగం చేసి రిటైరయ్యాను. కంపెనీలో ట్రేడ్ యూనియన్ నాయకుడిగా కొంతకాలమున్నాను. రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియాకు 3 జిల్లాల ట్రెజరర్‌గా చేసాను. 1985లో 'షెడ్యూల్డ్ కులాల సంక్షేమ సంఘం' స్థాపించి 90లో రిజిస్ట్రేషన్ చేసాం. బి.ఎస్.పి.లో కూడా క్రియాశీలంగా ఉన్నాను. 1993లో బౌద్ధ పరిషత్తుని స్థాపించాను. ఇప్పటికీ దానికి వ్యవస్థాపక కార్యదర్శిని నేనే. స్టీల్‌ప్లాంట్ బౌద్ధ సంఘాన్ని పెట్టించాను. సంఘమిత్ర పత్రికను 2 సం॥రాలు, భీంభేరి పత్రికను 4 సం॥రాలు నడిపాను. అలాగే బామ్‌సెఫ్, మూల్‌నివాసీ, బహుజన సంఘాలన్నింటి కార్యక్రమాలకీ సహకరిస్తుంటాను. ఇండియన్ బుద్ధిస్ట్ పత్రిక స్థాపకులు బెవర వీరభద్రరావుగారితో అప్పట్లో గిరిజన ప్రాంతాల్లో పనిచేసా. మహానాగ పత్రిక వ్యవస్థాపకులు వామనానందగారి సంపాదకవర్గంలో వున్నా. తారకంగారి నీలిజెండా, వరుణ్‌కుమార్‌గారి సమాంతర, కులనిర్మూలన తదితర పత్రికల వ్యాప్తికి కృషి చేస్తా. అనేక సభలూ, సమావేశాలు నిర్వహిస్తూ ప్రపంచవ్యాప్తంగా బౌద్ధసాహిత్యాన్ని తెప్పిస్తూ బౌద్ధధమ్మ ప్రచారానికి నావంతు పాటు పడుతున్నాను.

ప్ర) **బౌద్ధ సంఘాల్లోని ముఠాలకు, చీలికలకూ కారణాలేమిటి?**

జ) అధ్యయనం చేయకుండా బౌద్ధంలోకి వచ్చి, స్వార్థం కోసం రాజకీయాలు చేస్తున్న వారి వల్లే చీలికలనేవి ఏర్పడుతున్నాయి.

ప్ర) **మీ కార్యక్రమాల్లో ఎవరెవరింకా సహకరిస్తారు?**

జ) బైసా అరుణ్‌కుమార్, సత్యపాల్, ప్రజ్ఞ, మాటూరి శ్రీనివాస్, డి. నటరాజ్, ప్రచండ మొదలైనవారున్నారు.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో కూడా అగ్రకులాధిపత్యం రాజ్యమేలుతోందనీ, పేర్లముందు పిలకలూ, పేర్ల చివర తోకలూ తగిలించుకున్నవారే నాయకులుగా చలామణీ అవుతూ దళిత బహుజనుల్ని దూరం పెడుతున్నారనే విమర్శపై మీరేమంటారు?**

జ) ప్రజల్లో పుంజుకుంటున్న ప్రతీ ఉద్యమాన్నీ ఏదో పేరుతో గుంజుకుని హైజాక్ చేయడం బ్రాహ్మణిజం నైజం. నాస్తిక, హేతువాద, నక్సలైట్ ఉద్యమాల దగ్గర్నుంచీ బౌద్ధోద్యమాల దాకా పెత్తనం చేసేవారంతా అగ్రకుల నాయకులే కాని అణగారిన వర్గాల ప్రజలు కారు. ఇక సత్యశోధనాశక్తి ఉన్నప్పుడు పేర్లముందు పిలకలూ, పేర్ల చివరతోకలూ తీయాల్సిందే.

ప్ర) **బౌద్ధ సంఘాల్లో, అంబేద్కర్ సంఘాల్లో సైతం పురుషాధిపత్యమే అమలౌతోందనీ, అందుకే స్త్రీలసంఖ్య స్వల్పమనే వాదనపై మీ భావం?**

జ) పైకి ఏ మతాన్ని ఆరాధించినా ఆంతరికంగా బ్రాహ్మణిజాన్ని పాటిస్తున్నంత వరకూ పరిస్థితింతే. స్త్రీలకు రాజకీయ చైతన్యం కల్పించడంలో విఫలమవడమే ఈ స్థితి తలెత్తడానికి కారణం. దీన్ని అధిగమించాల్సి నవసరం వుంది.

ప్ర) **అంబేద్కర్‌ది నిజమైన బౌద్ధం కాదనే వాదన ఈమధ్య వినిపిస్తోంది. దానిపై...?**

జ) ఈరోజు ప్రపంచదేశాలన్నీ ఆరాధిస్తోంది మూఢ బౌద్ధాన్నే కాని నిజమైన బౌద్ధాన్ని కాదు. బౌద్ధం యొక్క అసలైన తాత్విక ప్రాతిపదిక అంబేద్కర్ ప్రతిపాదించిన నవయానం (నియో బుద్ధిజం)తోనే ముడిపడి వుంది. చారిత్రకంగా చూస్తే మహాయానంతో విబేధించిన హీనయానం యొక్క మరోరూపమే నవయానం. ఇదే థేరవాదం. సత్యాన్వేషణాదృష్టికల ప్రతి ఒక్కరి మతమిది.

ప్ర) **చివరిగా ఈనాటికీ బౌద్ధమెందుకు అవసరమో చెప్పండి?**

జ) కార్యకారణ సిద్ధాంతాన్ని ఇముడ్చుకున్న సశాస్త్రీయ మార్గం బౌద్ధం. సమాజంలోని నైతికతకు ప్రాధాన్యతనిచ్చే మతం బౌద్ధం. ప్రతి బౌద్ధుడు అంబేద్కరిస్టు కానక్కర్లేదు కానీ ప్రతి అంబేద్కరిస్టూ కచ్చితంగా బౌద్ధుడై తీరాలి. బాబా సాహెబ్ చూపిన మార్గంలో సమాజహితం కోసం బాధ్యతగా నడవాల్సిన కర్తవ్యం మేధావులు, విద్యావంతులు, కవులు, రచయితలమీద ఎంతైనా వుంది. ప్రజల్ని చైతన్యపరచడం కోసం ఎనలేని సహనాన్ని మనం అలవరుచుకున్నపుడే ఇది సాధ్యం.





బుద్ధభూమి పత్రిక స్థాపకులు

# కృష్ణార్జునబోధిగారితో

ఇంటర్వ్యూ

**ప్ర) బౌద్ధోద్యమంలోకి మీరెలా వచ్చారో చెప్పండి?**

జ) మాది గుంటూరుజిల్లాలోని మంగళగిరి వద్ద తాడేపల్లనే గ్రామం. దిగువ మధ్యతరగతి కుటుంబం. 7వ తరగతి మాత్రమే చదివాను. అదైనా బొటాబొటి మార్కుల్తో పాసయ్యాను. తర్వాత నుంచీ బతుకుబాట పట్టాను. ఆ క్రమంలో నాస్తిక హేతువాదోద్యమాలు మొదలుకుని వివిధ ప్రగతిశీల దళిత వామపక్ష ఉద్యమాల వరకూ ఎన్నింటితోనో పరిచయం ఏర్పడింది. 2001లో అనుకుంటా బౌద్ధానికి సంబంధించిన చిన్న పుస్తకమొహటి నన్ను బాగా ప్రభావితం చేసింది. సమాజానికి వుపయోగపడే ఉద్యమ భావాల సారమంతా బౌద్ధంలోనే నిక్షిప్తమై వున్నట్లు అర్థమై ఇటువైపొచ్చాను.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో సైతం చీలికలకీ, ముఠాలకు కారణమేమిటి?**

జ) ఇతర భావోద్యమాలలో ఉన్నన్ని గ్రూపులిందులో అయితే లేవు. ఆ ఉన్నవారు సైతం నిబద్ధతగా తోచిన రీతిలో బౌద్ధప్రచారానికి వారివంతు సాయపడేవారే తప్పితే పదవీవ్యామోహంతోనో, కీర్తికాంక్షతోనో వేరుకుంపటి పెట్టుకునేంత పెడధోరణులు ఇంకా రాలేదనే చెప్పాలి.

**ప్ర) బుద్ధభూమి స్థాపనకు దారితీసిన పరిస్థితులేవి?**

జ) బౌద్ధోద్యమ ప్రచారానికై తపించిపోతున్న రోజుల్లో బెవర వీరభద్రరావుగారు విశాఖపట్నంలో స్థాపించిన 'ఇండియన్ బుద్దిస్ట్', ఏలూరులో వామనానందగారి ఆధ్వర్యంలో నడుస్తోన్న 'మహానాగ', సవేరాగారి సంపాదకత్వాన అమలాపురం నుంచి వచ్చే 'ధమ్మప్రభ', వైజాగ్ నుంచి నవీన్‌గారి 'సంఘమిత్ర' మొదలైన పత్రికలకు నిత్య పాఠకుడిగా వుంటూ చందాదారుల్ని చేర్పించేవాడ్ని. వీటిల్లో 3 పత్రికలు ఆగిపోవడంతో బౌద్ధోద్యమ ప్రచారానికి మేధోపరమయిన సాధనం కోసం సుమారు 10 సం॥రాలు

పరితపించి సంపాదకుడిగా ఉండడానికి నా అనర్హతను గ్రహించి సాహిత్యపరంగా, మేధోపరంగా నాకంటే ఉన్నతులైనవారి సారధ్యంలోనే పత్రికను పెట్టి తీసుకురావడం జరుగుతోంది.

**ప్ర) బౌద్ధ సంఘాల్లో కూడా కులం ప్రధానపాత్ర పోషిస్తోందనీ, పేర్లముందు పిలకలూ, పేర్ల చివర తోకలూ పెట్టుకునే వాళ్ళంతా నాయకులుగా చలామణీ అవుతున్నారనే వాదనపై మీ భావన?**

జ) ఇందులో పూర్తిగా వాస్తవం లేదు. బౌద్ధంలో లేని కులం బౌద్ధుల్లో వుంటుందనుకోడం భ్రమే. కుల సమాజం నుంచి వచ్చిన ఏ సంస్థయినా కులభావన నుండి బయటపడలేదు. అయిప్పటికీ కులతత్వానికి వ్యతిరేకంగా విజృంభించిన ఆరంభోద్యమాలలో బౌద్ధం ప్రముఖమైనది. కాబట్టి ఈ రోజున్న స్థితి నుంచి సైతం కచ్చితంగా బౌద్ధం బయటపడి కులరహిత వ్యవస్థ దిశగా పురోగమిస్తుందని నా ఆకాంక్ష.

**ప్ర) రాష్ట్రంలోని బౌద్ధసంఘాల్లో పురుషాధిక్యతే అమలవుతోందనీ, స్త్రీల సంఖ్య అంతంతమాత్రంగానే వుందనే విమర్శపై మీరేమంటారు?**

జ) ఈ లోపం ఉన్నమాట నిజం. దీన్ని సరిచేసుకోవాల్సిన అవసరముంది.

**ప్ర) భారద్దేశంలో బౌద్ధ పతనానికి దారితీసిన పరిస్థితులేవి?**

జ) ఒకటికాదు, అనేకం ఉన్నాయి. వైదికమత అణిచివేతతో బాటు బౌద్ధారామాల్లో తలెత్తిన వినాశకర ధోరణుల వరకూ ఎన్నింటినో విశ్లేషించి చూస్తే కాని ఈ విషయంలో స్పష్టత రాదు. కాబట్టీ ఏదో ఒక సాకుని చూపించి సరిపెట్టడం సరికాదని నా అభిప్రాయం.

**ప్ర) బహిరంగంగా ఎన్నో కబుర్లు చెప్తూ, గొప్ప గొప్ప రాతలు రాసే బౌద్ధాభిమానుల్లో వ్యక్తిగత దిగజారుడుతనం, అహంకారం, స్వార్ధం బౌద్ధధమ్మవ్యాప్తికి ఆటంకాలనే విమర్శపై మీ అభిప్రాయం?**

జ) ఏ ఉద్యమం కూడా వందశాతం పరిపూర్ణంగా వుండదు. ఒకటో అరో లోపాలనేవి వుంటూనే వుంటాయి. సంపూర్ణతను సాధించే క్రమంలో అలాంటి లోటుపాట్లను నిజాయితీగా సరిచేసుకోకపోతే ఏ ఉద్యమమైనా అధోగతి పాలవుతుంది. బౌద్ధధమ్మం సైతం ఇందుకు మినహాయింపు కాదు.

**ప్ర) ఈరోజు బౌద్ధం అంబేద్కర్ అభిమానులకు మాత్రమే పరిమితమైందనీ, నిజమైన బౌద్ధాభిమానుల సంఖ్య కన్నా అంబేద్కరిస్టులు, మార్క్సిస్టులు,**

కమ్యూనిస్టు బౌద్ధుల సంఖ్యే ఎక్కువనే వాదనపై మీరేమంటారు?

జ) అది నిజం కాదు. అంబేద్కర్ మార్గదర్శకత్వాన్ని మనసారా స్వీకరించి అధ్యయనం ద్వారా బౌద్ధంలోకి వస్తున్న వారి సంఖ్య యిప్పటికీ తక్కువే. పైగా పైకి అంబేద్కర్‌నీ, బుద్ధుడ్నీ జపిస్తూ లోలోపల ఇతర మతాల్ని అవలంభించేవారే తప్ప నిజంగా నిబద్ధతతో బౌద్ధధమ్మాన్ని స్వీకరిస్తున్నవారు స్వల్పమే. బౌద్ధం ప్రధానంగా మానసిక పక్వతపై ఆధారపడినది. అలాంటప్పుడు ప్రాపంచిక సమస్యలపై స్పందనగా తలెత్తిన వాదాలన్నీ బౌద్ధానికి సన్నిహితంగానే ఉంటాయి. ఆయా వాదాల్ని సమర్ధించేవారందరికీ సామాజిక హితానికై పాటుపడే బౌద్ధమంటే ఎంతో కొంత ఆసక్తీ, అభిమానమూ ఉండటం సహజం.

ప్ర) మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?

జ) ఇప్పటికి 5 సం॥రాలుగా సుమారు 1500 మించిన సర్క్యులేషన్‌తో 'బుద్ధభూమిని' నడుపుతున్నాం, ఒడిదుడుకులెన్ని ఎదురైనా తెలుగునేలలో మేధోవంతమైన చింతనాత్మక సారస్వతానికి పత్రిక కూడా ముఖ్య భూమికగా మారిందనుకుంటున్నాం. బౌద్ధ సాహిత్యాన్ని వెలువరిస్తున్నాం. వివిధ సభలు, సమావేశాలు పెడుతున్నాం. ధమ్మయాత్ర పేరుతో బౌద్ధ ప్రాధాన్యతగల ప్రాంతాల్ని సమిష్టిగా సందర్శిస్తున్నాం. రాష్ట్రంలోనే మొట్టమొదటిసారిగా 'అశోకమేళా', బౌద్ధ ఐక్యవేదికనూ మేమే నిర్మించాం. అన్నపరెడ్డి వెంకటేశ్వర్రెడ్డిగారు, చెన్నూరు ఆంజనేయరెడ్డిగారూ, వేటపాలెం చంద్రశేఖర్ గారు, బోధచైతన్య, గోలి సీతారామయ్య, నా కుటుంబ సభ్యులు, ఇతర మిత్రుల సహకారం ఎంతో ఉంది.

ప్ర) చివరిగా, బౌద్ధం ఈనాటికీ ఎలా అవసరమో చెప్పండి?

జ) తోటి మనిషిపట్ల బాధ్యతను బౌద్ధం పెంచుతుంది. సాటి మనిషి బాధకు బౌద్ధం స్పందిస్తుంది. మానవాళి దుఃఖానికి శాస్త్రీయమైన పరిష్కారాల్ని వెతికి సుఖానికి మార్గాన్ని చూపిస్తుంది. అలాంటి బౌద్ధం ఎప్పటికైనా సమాజానికి అవసరమేనన్నది నా అవగాహన.

# అనుబంధం



నిజమైన హేతువాదీ, నిఖార్సయిన ఆచరణవాదీ

# దేవగుప్తపు పేరలింగంగారితో

ఇంటర్వ్యూ

**ప్ర) మీ భావోద్యమ ఆరంగేట్రం ఎలా జరిగింది?**

జ) నేను 1942 సెప్టెంబరు 6న తూ.గో.జిల్లా పామర్రులో సోమాలమ్మ, సుబ్రహ్మణ్యం దంపతులకు పుట్టాను. ఐదో తరగతి వరకే చదివాను. ఇంట్లో భక్తి వాతావరణం వుండడంతో సహజంగానే అంతరాత్మవేసే ప్రశ్నల్ని అణిచేసి భక్తుడ్నయిపోయా. ఆ క్రమంలో వోసారి నా చేయి విరిగితే చాలారోజులు చర్చికెళ్ళి ఏమీ ఫలితం కన్పించక మోసం గ్రహించినప్పటికీ హైందవమత అవలంబికుడిగా చాలా కాలమున్నాను. వడ్రంగం, కమ్మరం, వ్యవసాయ పనుల్తో పాటు డిటెక్టివ్ నవల్లు అద్దెకిచ్చే కొట్టు, సైకిల్ షాపు, చిట్‌ఫండ్ వ్యాపారం చేసేవాడ్ని. అవన్నీ దెబ్బతినడంతో రాజమండ్రికి మకాం మార్చి లారీబాడీబిల్డగా చేసేవాణ్ణి. సాయిబాబా, వినాయక భజన సంఘాలు స్వయంగా నడిపేవాడ్ని కూడా. ఆ నేపథ్యంలో అనుకోకుండా ఒకసారి హేతువాద మహాసభ జరుగుతూంటే యధాలాపంగా చూసాను. మంత్రాలతో ఎన్నో అద్భుతాలు చేస్తాడని నాలాంటి ఎంతోమంది నమ్మే రామలింగ సిద్ధాంతిని స్టేజ్‌పైనున్నొకాయన 'ఒరేయ్ రామలింగ సిద్ధాంతి' అని పిల్చి డైరెక్టుగా తిడుతూ దమ్ముంటే మహిమలు చూపమనడంతో నాకక్కడికక్కడే తలతిరిగి, ఒళ్ళు తొణికి వోపిక లేక కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చి వాలిపోయాను. ఆ రాత్రితో నిఖార్సయిన హేతువాదిగా మారాను.

**ప్ర) ఒక్క రాత్రితో అదెలా సాధ్యమయింది?**

జ) నిజానికి ఎప్పట్నుంచో నాలో జరుగుతున్న సంఘర్షణకి సమాధానం ఆరోజు దొరికింది. స్టేజ్‌మీద రామలింగ సిద్ధాంతిని సవాలు చేసినాయన ఎన్‌కౌంటర్ దశరధరామని తర్వాత నాకు తెల్సింది. ఆ దెబ్బతో ఎన్‌కౌంటర్ చదివిన నాకు ఒక్కసారి దిమ్మతిరిగిపోయింది. దేవుళ్ళూ, అమ్మలు, బాబాలు,

స్వాములు, రాజకీయ నాయకులు, సెలబ్రిటీలూ అందరినీ ప్రజాపక్షంగా ఉతికారేసే ఆయన ధోరణి ఎంత జ్వాజ్వల్యమానంగా నన్నుత్తేజపరిచిందంటే ఆరాత్రి నాలోని దశాబ్దాల బానిస చచ్చిపోయి ప్రతిదాన్ని ధైర్యంగా ప్రశ్నించే వో నూతన మానవుడైన హేతువాది ఉద్భవించాడు.

**ప్ర) మరప్పుడు ఎన్‌కౌంటర్ దశరథరామ్‌ని కలవలేదా?**

జ) లేదు. ఆ నిప్పులుకక్కే వ్యక్తిత్వాన్ని దూరంనుంచి చూస్తుంటేనే వూహలన్నీ బిక్కచచ్చిపోయి గాలి స్తంభించినట్లుండేది.

**ప్ర) మీపై ఇంకెవరెవరి ప్రభావం ఉంది?**

జ) ఎన్‌కౌంటర్ దశరథరామ్, రావిపూడి వెంకటాద్రి, తాపీ ధర్మారావు, సి.వి., రంగనాయకమ్మ మొదలైనవారి రచనలు చదివి ప్రభావితమయ్యా.

**ప్ర) మీ కార్యక్రమాల వివరాలు చెప్పండి?**

జ) దేవుడు లేడనే ప్రచారం, మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా ప్రచారం, వాస్తు, తాయెత్తులు, మహిమల బండారాల్ని ఛాలెంజ్ చేయడం లాంటివి చేస్తున్నప్పుడు కూడా హేతువాద సంఘమనే దానితో నాకు సంబంధం లేదు. నా సైకిలుకి 'హేతువాద చైతన్యరథమ'నే బోర్డు పెట్టుకుని "దేవుడు దోపిడీకి మరోపేరు", "కులమతాల అడ్డుగోడలు - అంటురోగాలు", "దైవభక్తొక మానసిక వ్యభిచారం" అంటూ నినాదాలు దానిమీద రాసుకుని వొక చిన్న మైకు పెట్టుకుని వీధివీధిలో ప్రచారం చేసేవాడ్ని. "వాస్తు, జ్యోతిష్యం అశాస్త్రీయ మూఢ నమ్మకాలు" "మూఢ నమ్మక నిర్మూలనోద్యమం" మొదలైన కరపత్రాల్ని స్వయంగా రాసుకుని ప్రచురించడానికి డబ్బుల్లేకపోవడంతో రాతప్రతుల్నే పంచిపెట్టేవాడ్ని. ఏ నలుగురు ఒకచోట కనబడ్డా సైకిలాపి వారికి నా రాతపత్రాలిచ్చి మూఢనమ్మకాల్నుంచి బయటపడాలనీ, దేవుడ్ని నమ్మడం మానుకోవాలనీ, సామాజిక స్పృహను ఏర్పర్చుకోవాలనీ చెప్పేవాడిని. అలా దాదాపు 3 దశాబ్దాలపాటు హేతువాద భావాల్ని ప్రజలకు పనికట్టుకుని ప్రచారం చేసాను. సైన్సు గ్రంథాలయాన్ని యింటి దగ్గర స్థాపించి వివిధ గ్రామాలకూ, సంఘాలకూ అవసరమైన చైతన్యవంత సాహిత్యాన్ని చదివి తిరిగి అందజేయడానికి ఇవ్వగలనని పోస్టుకార్డులు రాసేవాడ్ని. సభలూ, సమావేశాలకు తప్పనిసరిగా హాజరయ్యేవాడిని.

ప్ర) మరి ఈ మార్గంలో మీకెదురయిన అనుభవాలెలాంటివి?

జ) చాలా తీవ్రమైనవి. పోకిరీలు అడ్డగించి వేధించేవారు. సైకిలు తాళం వేసి పారిపోయేవారు. టైర్లను పంచరుచేసి "ఇప్పుడు కన్పిస్తాడ్రా నీకు దేవుడు" అంటూ హేళన చేసేవారు. ఇక రాళ్ళు విసరడం, దాడులు చేయడం లాంటివెలాగూ జరగనే జరిగేవి. ఒకసారి ఒకచోట ఆ ప్రాంత కౌన్సిలర్ చొక్కా పట్టుకుని బండబూతులు తిడుతూ పోలీస్ స్టేషనుకప్పగించాడు. నా నినాదాలు, ప్రవర్తన చూసి ఎక్కడా పనికూడా ఇచ్చేవారు కాదు. మరికొందరైతే పని మధ్యలోంచి పంపేసేవారు. మా పిల్లలందరికీ దండల పెళ్ళిళ్ళే జరిపించా. తల్లిదండ్రులు చనిపోయాక కార్యక్రమాలు జరపనంటే బంధువులు కోప్పడ్డా జంకలేదు. పైగా "పిండములను చేసి పితరులకు తలపోసి కాకులకు పెట్టు గాడ్దెలారా" అన్న వేమన పద్యాన్ని పోస్టుకార్డుమీద రాసి వారికి పంపించాను.

ప్ర) భావోద్యమాల్లో కూడా ముఠాలు, గ్రూపులు ఎందుకున్నాయి?

జ) భావోద్యమాలన్నింటినీ ఒకే గాడిన కట్టేయడం కూడా సరికాదు. ఎవరి ఆలోచనల పరిధిలో వాళ్ళు పనిచేస్తూ తదనుగుణంగా ప్రజల్ని చైతన్యవంతం చేయడానికి ప్రయత్నిస్తున్నవారున్నారు. కాబట్టి భావోద్యమకారుల్లోనూ, భావోద్యమ సంఘాల్లోనూ భిన్నత్వమనేది ఆహ్వానించదగిందే.

ప్ర) భావోద్యమాల్లో కూడా కులం, పురుషాధిపత్యం ఉన్నాయనొప్పుకొంటారా?

జ) రాజకీయాల్లాగానే కులం, డబ్బు, పురుషహంకారం భావోద్యమాల్ని కూడా విపరీతంగా శాసిస్తున్నాయి. వేదికలమీద పెద్ద పెద్ద పదాలనుపయోగిస్తూ గంటల తరబడి ఉపన్యాసాలిచ్చే హేతువాద నాయకులు సైతం కులహంకారం, పురుషాధిపత్యమనే రోగాలతో బాధపడుతూండడం మూలాన సామాన్య కార్యకర్తల్లో కూడా ఈ అంశాలపైనున్న అపోహలు తొలగిపోవడం లేదు.

ప్ర) భావోద్యమాల్లో స్తబ్దతుందని ఒప్పుకుంటారా? ఐతే కారణాలేంటి?

జ) వేదికలెక్కి కాళ్ళూపుకుంటూ గంటలకొద్దీ ఉపన్యసించే నాయకులూ, చేతులు బొబ్బలెక్కేంతవరకూ రోజుల తరబడి పుస్తకాల్రాసి పారేసిన ప్రబుద్ధులూ సొంతింటి దగ్గర కొచ్చేటప్పటికి స్త్రీలను బొంతకోడిపెట్టల్లా దాచిపెట్టుకుంటూ ఛాందసమతవాదుల్లా ప్రవర్తిస్తున్నారే గానీ వివేకవంతుల్లా వ్యవహరించడం లేదు. అలాగే వారి పిల్లల్నీ కుటుంబ సభ్యుల్నీ భావోద్యమాల్లోకి

తీసుకురావడానికి చూడ్డం లేదు. వారి పిల్లలు మాత్రం పెద్ద పెద్ద చదువులు చదివి గొప్ప గొప్ప ఉద్యోగాలు చేస్తూ మంచి జీతాలతో సుఖాలనుభవించాలి, ఇతర పిల్లలు మాత్రం అర్జెంటుగా ఉద్యమ కారులైపోయి త్యాగాలు చేసెయ్యాలి. ఈ విధమైన ఆలోచనతోనే ఉద్యమాన్ని చేజేతులా చెంకనాకేలా చేసుకున్నారు.

**ప్ర) ఇక చివరగా మీరింకేమైనా చెప్పదల్చుకుంటే చెప్పండి?**

జ) మొన్నో సభలో అంతర్జాతీయ హేతువాది గోగినేని బాబుగారికి గౌరవ్‌గారు నన్ను పరిచయం చేస్తే ఆయనాశ్చర్యపడి, "మిమ్మల్ని కలవకుండానే వెంకటాద్రిగారి ద్వారా మీ గురించి తెల్సుకుని అంతర్జాతీయ పత్రికలో సైతం మీగురించి రాసానని" నాతోచెప్పి నన్ను పరిచయం చేసినందుకు గౌరవ్‌కి కృతజ్ఞతలు చెప్పారు. మూడు దశాబ్దాలుగా నిక్కరేసుకుని డొక్కు సైకిలు తొక్కుకుంటూ ప్రజల్లో ప్రచారం చేస్తున్న క్షేత్రస్థాయి ఉద్యమం నాది. కాకినాడ హేతువాద సభలకెళ్ళి వస్తోంటే జరిగిన యాక్సిడెంట్‌లో కాలు విరిగింది. కొంతకాలమే నయమౌతుందని డాక్టర్లు చెప్పారు. అంత బాధలో కూడా "నేను మంచంపైనుంటే హేతువాద ప్రచారమెవరు చేస్తార"ని నాయకుల్నడిగితే, వారికి కంట నీరాగలేదు. మిత్రులు కెమెరా విజయ్‌కుమార్‌గారైతే 'Peralingam is a living Legend to the Rationalist Movement' అంటూ వారబ్బాయి పెళ్ళివేదిక మీదనే నన్ను 'ఏకైక నిబద్ధత గల ఆచరణాత్మక హేతువాదని సంబోధించారు. పసల భీమన్నగారైతే 'One man Army' అంటారు. 2006లో మానవ వికాసం మానవవాద మాసపత్రిక నా ముఖ చిత్రంతో ప్రచురించడమే కాక నన్నింటర్వ్యూ చేసిన వివరాలతో బాగా తేవడం జరిగింది. ఈ మధ్యనే సైన్సు+మూఢనమ్మకాలనే రచన చేసి ప్రజాపత్రిక సహకారంతో, ప్రవ్వ అధ్యయన వేదిక తరపున ప్రచురించాను. 'గోదావరీ హేతువాద తరంగం పేర్లింగంగా' పేరొందిన నేను కులమతాల గోడల్లేని సత్యశోధనా, నీతిపోషణా, విజ్ఞానశాస్త్ర అవగాహనా, మనిషిని మనిషిగా ప్రేమించే సర్వమానవ స్వేచ్ఛా సమతా భావనా, స్త్రీ పురుష సమానత్వానికి విలువిచ్చే నాగరిక బావాలతో నిండిన శ్రేయోజగత్తును ఆకాంక్షిస్తూ, అందుకొరకై కృషి చేస్తాను, సెలవు.



నిస్వార్థ భావోద్యమకారుడు

# యాళ్ళ సూర్యనారాయణగారితో ఇంటర్వ్యూ

ప్ర) భావోద్యమాల్లోకి మీరెలా వచ్చారో చెప్పండి?

జ) నేను ఉత్తరాంధ్ర జిల్లాలో గరుగుబిల్లి మండలం, బురదవెంకటాపురం గ్రామంలో సామాన్య వ్యవసాయ రైతు కుటుంబంలో పుట్టాను. మా తల్లిదండ్రులు నిరక్షరాస్యులు, కష్టజీవులు, అమ్మ స్వామమ్మ, నాన్న చిన్నమనాయుడు. మహోజ్వల శ్రీకాకుళ సాయుధ పోరాటం ఉధృతంగా సాగుతోంది. ఆదిభట్ల కైలాసంగారి సోదరుడు ఆదిభట్ల చైన్లుగారు 7వ తరగతిలో మా ఉపాధ్యాయుడిగా వుంటూ అభ్యుదయ సాహిత్యాన్ని గురించిన అభిలాషను మాకు చిన్నతనంలోనే కలిగించారు. శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరులో తర్వాత నేలకొరిగిన ఎంతోమంది అజ్ఞాతవీరులకు మా ఇంట్లో ఆశ్రయం దొరకడంతో బాల్యం నుంచే ప్రగతిశీల భావజాలాన్ని ఏర్పర్చుకునే అవకాశమొచ్చి భావోద్యమాలవైపు వచ్చాను.

ప్ర) ఆ సమయంలో ఏవైనా ఉద్యమాల్లో పాల్గొన్నారా?

జ) అజ్జాడ, కోటిపాము, విశాఖపట్నంలలో నా చదువు సాగింది. మార్క్సిస్టు దృక్పథంతో వచ్చిన మార్పు విస్తృతమై నాస్తిక హేతువాద ఉద్యమాలవైపు నన్ను తీసుకొచ్చింది. అలా రాజనీతిశాస్త్రంలో ఎమ్.ఏ. చేసి నీటి పారుదల శాఖలో గుమస్తాగా 26 యేళ్ళు పన్చేసి రిటైరయ్యా. ఉద్యోగం రాకముందు వో పది సం॥రాలు వ్యవసాయం చేసాను. అప్పుడే గ్రామాభివృద్ధి కోసం స్థానిక యువతతో కల్సి 'సమత' అనే యువజన సంఘం స్థాపించి ఎన్నో కార్యక్రమాలు చేసా. ఒక గ్రంథాలయాన్ని కూడా స్థాపించాం. అప్పట్లో కురుపాం మండలం పెదమేరంగిలో వెంపటాపు సత్యం మాస్టారూ, పుచ్చలపల్లి సుందరయ్యగారు మొదలైన మహామహుల ఆధ్వర్యంలో జరిగిన

బ్రహ్మాండమైన బహిరంగ సభకు హాజరై మా యువజన సంఘం తరఫున కొంతమొత్తం విరాళాన్ని కూడా వారికి నేను స్వయంగా అందజేయడం జరిగింది.

**ప్ర) భావోద్యమాల్లో సైతం గ్రూపులు - ముఠాలు చీలికలపై మీ అభిప్రాయం?**

జ) అహంకారంతోనూ, స్వప్రయోజనాల కోసమైతే తప్ప అంతిమ లక్ష్యం ఒకటే అయినప్పటికీ ఎవరి ఆలోచనలకనుగుణంగా వారు విడిగా వీలున్న పరిస్థితుల్లో పనిచేయడం తప్పుకాదనుకుంటాను, అది సహజమే.

**ప్ర) భావోద్యమాల్లో కూడా కులం, పురుషాధిపత్యం ఉన్నాయని ఒప్పుకుంటారా?**

జ) వొప్పుకుంటాను. అగ్రకులాధిపత్యం, పురుషహంకారం యింకా కొనసాగుతూనే వున్నాయి, ఈ పరిస్థితి మారాలి.

**ప్ర) మీ కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ) 1976 నుంచి 2002 వరకూ ఎన్నో ప్రదేశాల్లో ఉద్యోగం చేసీ రిటైరై 2010 వరకూ భారత నాస్తిక సమాజంతో వుండి తర్వాత భావోద్యమాలకు వెన్నుదన్నుగా నిలిచేందుకు గాను 'శాస్త్రీయ ఆలోచనలు పెంపొందించు దాతృత్వసంస్థ'ను పార్వతీపురంలో రెండు ప్రధాన మతాల వారి అడ్డాగా పేరొందిన చర్చివీధిలో అరెకరం స్థలంలో మానవాళికోసం జీవితాన్ని త్యాగం చేసిన మహనీయులు, శాస్త్రజ్ఞులు, విజ్ఞానమూర్తులైన 18 మంది విగ్రహాలతో ధైర్యంగా స్థాపించగలిగాను. మా తల్లిదండ్రులిచ్చిన కొద్దిపాటి భూమితప్ప నా జీతమంతా సమాజానికే ఖర్చు పెడతాను. ప్రగతిశీల అభ్యుదయ సంఘాలన్నింటికీ నా సహాయ సహకారాలందిస్తాను. కొన్ని వేల గ్రంథాలను వందలాది గ్రంథాలయాలకు విరాళంగా ఇచ్చేసాను. వచ్చిన డబ్బూ, చదివిన పుస్తకం నా దగ్గరుండ కూడదన్నదే నా పాలసీ. అలా ఇచ్చిన పుస్తకాలు, విరాళాలన్నింటికీ నిర్దిష్టమైన రిజిష్టర్ మెయిన్‌టెన్ చేస్తుంటా. రాష్ట్రమంతటా విస్తృతంగా తిరుగుతూ ప్రజాఉద్యమ కారులందర్నీ కలుస్తుంటాను. అలాగే మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా అప్పట్లో 3 రోజుల రాష్ట్రస్థాయి సదస్సును కూడా ఇక్కడ నిర్వహించాను. ప్రసారమాధ్యమాల్లో విషయాలు తెల్సుకుని గిరిజన ప్రాంతాలకు వందలాది మైళ్ళ ప్రయాణం చేసి అక్కడ

మూఢనమ్మకాల నుంచి ప్రజల్ని చైతన్యవంతం చేసే కార్యక్రమాల్ని చేస్తుంటాం. ఇవి కాక ఎంతోమంది ఉద్యమకారులకూ, రచయితలకూ ఆర్థికంగా సహకరిస్తుంటాను. వివిధ స్వచ్ఛంద సంస్థలకూ, సేవాశ్రమాలకూ మా పొలంలోని వందలకొద్దీ ఆహార బస్తాలనందజేయడమే కాక వృద్ధాశ్రమాలకూ, అనాధ శరణాలయాలకూ మందులు కూడా కొనిస్తుంటాను. చాతనైనంతలో పేదలకు సాయపడ్డం మినహా నాస్తికుడిగా జీవితానికి వేరే పరమార్థమేదీ ఉందనుకోను.

**ప్ర) భావోద్యమాల్లో స్తబ్దతుందని అంగీకరిస్తారా? ఐతే కారణాలేంటి?**

జ) భార్యాపిల్లల్ని భావజాల పరులుగానో, భావవారసులుగానో కచ్చితంగా తయారుచేయమని నేనేం చెప్పనుగానీ కనీసం భావసానుభూతిపరులుగా మల్చుకోడంలో సైతం నాయకులు విఫలమవడమే ఈ స్తబ్ధతకి కారణం.

**ప్ర) యువత ఉద్యమాల్లోకెందుకు రావడం లేదు?**

జ) పెట్టుబడిదారీ బూర్జువా మానసిక స్వభావాల్నే ఈనాటి ప్రసార మాధ్యమాలు యువతలో ప్రేరేపిస్తున్నాయి కాని సామాజిక దృక్పథాన్ని కాదు. విద్యావిధానాలు సైతం చిన్న వయసులోనే పిల్లల్ని తప్పుదారి పట్టిస్తున్నాయి. తెల్సిన పెద్దవాళ్ళు కూడా సమాజం నుంచి దూరం జరిగి పిల్లలు బాగుంటే చాలనుకోడంతో ఉద్యమాల్లో కొచ్చే యువతను భూతద్దంతో వెతికి పట్టుకోవాల్సిన దుస్థితి ఏర్పడింది.

**ప్ర) మీకెదురైన ఆటుపోట్లు, ఆటంకాలు ఏవైనా ఉన్నాయా?**

జ) అనేక బెదిరింపులొస్తుంటాయి. నా స్థలం ఆక్రమించుకునే ఉద్దేశంతోనున్న కబ్జారాయుళ్ళపై దాదాపు 15 కేసులు పెట్టి విజయం సాధించా. ఇంకా కొన్ని కేసులు పెండింగ్‌లో ఉన్నాయి.

**ప్ర) ఇక, చివరగా మీరేం చెప్పాలనుకుంటున్నారు?**

జ) ఈ నా కార్యక్రమాలన్నిట్లో నా సహచరి సరస్వతమ్మ సహకారం విలువకట్టలేనిది. మొదట్లో ఇద్దరు బిడ్డలు పుట్టి చనిపోతే సమాజంలోని నిర్భాగ్యులందర్నీ సంతానంగా భావించదల్చి సంసార జీవితాన్ని ఇరువురం స్వచ్ఛందంగానే విడనాడాం. ఇప్పటిదాకా నా జీవితంలో ఇస్త్రీబట్ట కట్టలేదు.

ఒక్క రూపాయి అవినీతికీ, లంచాలకీ ఖర్చుపెట్టలేదు. తినడానికి తల్లితండ్రులిచ్చిన పొలం మినహాయిస్తే ఈ ఇంటిస్థలం, పూరిపాక, నాలుగైదు జతల బట్టలు, నిత్యావసర వస్తువులు తప్ప సొంతాస్తులేవీ లేవు. తనువు చాలించేలోగా వీటిని కూడా సమాజపరం చేయాలనేదే నా కోరిక. మరణానంతరం మా దంపతుల దేహాల్ని హాస్పటల్‌కి ఇచ్చేసేలా వీలునామా రాసా. కులమతాల కతీతమయిన మానవీయ జీవితాన్ని కొనసాగిస్తూ ప్రజా ఉద్యమాలకు నా వంతు సమిధిగా తోడ్పడటమే నా జీవిత లక్ష్యం, సెలవు.



"Those who think that Buddhism is interested only in lofty ideals, high moral and philosophical thought, and ignores any social and economic welfare of people, are wrong. The Buddha was interested in the happiness of men. To him happiness was not possible without leading a pure life based on moral and spiritual principals. But he knew that leading such a life was hard in unfavourable material and social conditions.

Buddhism does not consider material welfare as an end itself; it is only a means to an end – a higher and nobler end. But it is a means which is indispensable, indispensable in achieving a higher purpose for man's happiness. So Buddhism recognizes the need of certain minimum material conditions favourable to spiritual success – even that of a monk engaged in meditation in some solitary place."

– Dr. **W. Rahula**

What the Buddha Taught

# గౌరవ్ ఇతర రచనలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏంటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్తిత్వం - అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం - మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథాకమామిషు
10. తత్వ విచారణ - తర్క వివేచన
11. పురుషుడు - స్త్రీ (చలం Man & Womanకి స్వేచ్ఛానువాదం)
12. కులానికి సవాలు
13. ప్రకృతి - శాస్త్రం - సమాజం
14. ధిక్కార స్వరాలు (భావోద్యమకారులింటర్వ్యూలు)
15. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా (జయప్రకాష్ నారాయణ్ వ్యాసానువాదం)
16. కలాలు - కరపత్రాలు
17. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
18. శిధిలాక్షరం (కవితా సంపుటి)

ప్రపంచ చరిత్రలోనే అరుదైన అపూర్వ ప్రజాస్వామిక వ్యవస్థను నిర్మాణాత్మకంగా రూపొందించే ప్రయత్నం చేసిన అద్వితీయ దార్శనిక మానవీయ మార్గానికి సంబంధించిన చర్చను వర్తమాన వ్యవస్థలో కొందరి ఇష్టాయిష్టాలకు లోబడి విస్తృతంగా చేపట్టకుండా అవాంఛనీయ పరిమితుల్ని నాకు నేను విధించుకోడం న్యాయమనిపించలేదు. అందుకనే ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనున్న కొంతమంది బౌద్ధ ఉద్యమకారుల్ని, కార్యకర్తల్ని, మేధావుల్ని, రచయితల్ని ఎంచుకుని ఈ ఇంటర్వ్యూల సంపుటినిలా వెలువరిస్తున్నాను.

- గౌరవ్